# ప్రస్తావన

పద్మినీసతి లోక ♦ బాంధవు పెండిలి వ్రాసియుండెను జాల ♦ వన్నెమీర
రామాయణంబంత ♦ రసికులు మెచ్చగా నాటకంబుగ వ్రాసి ♦ నాతుగన

తే. గీ. నరయ సంపూర్ణరామాయ ♦ ణాఖ్య దీని
ఖేలనము జేయ మనకిచ్చె ♦ లాలితముగ
నటివ గూడూరు కోటీశ్వ ♦ రాఖ్యుఁడనగ
నున్న వా డిల పేరును ♦ గొన్నవాడు.

నటి—ఆర్యా! కోటీశ్వరరావు వ్రాసినదేనా యీ సంపూర్ణరామాయణము?

సూ—చెలీ! యేమీ యింత తేలికగా బల్కెదవు.

నటి—ఈచిరుతఁడు రచించిన రామాయణము మనసభికులకు రుచించునాయని యిట్లు బల్కితిగాని వేరొండుగాదు.

సూ—అదియా! కవి పిన్నయైననేమి?

క. రామకథ పాపనాశము । రాముని దలచినను పుణ్య ♦ రాశి లభించున్
రాముని మదిలో దలపని । పామరుఁ డీలోకమందు ♦ బాముల బొందున్.

కవి పిన్నయైననేమి, పెద్దయైననేమి? రామకథ సర్వజనాదరణీయము. ప్రేయసీ! కాలహరణమైనందులకు మనసభికులు మనపై గినియుచుండిరి. ఇక మీద కర్తవ్యమాచరింతము. సర్వజన సంతోషదాయకమగు వసంతమునుగురించి కొంచెము వర్ణించుము, పోదము.

నటి—చిత్తము. అటులనే వర్ణించెద.

ఉ. మారుని రాకఁ గన్గొని య ♦ మందమతిన్ శుకముల్ చెలంగఁగాఁ
దీరుగ నిల్చి బర్హితతి ♦ ధీరతఁ గుల్కుచు నాట్యమాడఁగాఁ
గోరిక దీరఁ దుమ్మెదలు ♦ కుత్తుక లెత్తి రుతంబు సేయఁగా
మీరి వసంతకాలమున ♦ మేల్మి జరింతురు స్త్రీలు పూరుషుల్.

సూ—ఆహా! యేమి యీ వసంతఋతువర్ణనము! శ్రవణానందముగానున్నది.

గీ. బోటి నీపాట వినుటచే ♦ నాటకంబు
మాట మరచితి క్షీరాబ్ధి ♦ మాధవుండు
వనజభవముఖ్య నిర్జర ♦ వరులకెల్ల
నభయదానంబొసంగెడు ♦ నంబుజాక్షి.

నటి—అటులనా! నేత్రోత్సవముగా జూతమురండు.

(నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.



శ్రీ

# సంపూర్ణ రామాయణము



## ప్రథమాంకము

### ప్రథమరంగము.

(ఇంద్రుఁడు, బ్రహ్మ, నారదుఁడు, గౌతముఁడు, కణ్వుఁడు ప్రవేశము.)

అందరు— కీర్తన. బారువ రాగము - ఏకతాళము.

కమలా - లోలా - కలుషహరా

కమలముఖా - కరివరదా

శ్రీ; శా; కా; పూ;

రక్కసిబాధలు - యెక్కువలయ్యెఁగా | నిక్కము మేమిక నిలువగజాలము

నా; రా; యు; ణా; మమ్ములజూచి | మమువడిగాచి | సమ్మతిదీర్చి | మమ్ములఁబ్రోచి |

కష్టముదొలఁగగా | యిష్టముసాగగా | క్రతువులు జరుగగా | ఘనతగా వెలుఁగగా || కమలా||

(శేషశయ్యపై విష్ణువు లక్ష్మీసమేతుఁడై కన్పట్టును.)

విష్ణు—సురలారా! మీకుఁ గుశలమే?

ఇంద్రు— సీ॥ కుశలముండిన మాకు ♦ వసుమతీనాథ ని
న్నాసించు వేళల మే ♦ మంబుజాక్ష

విష్ణు— వివిధయాగముల ని ♦ ర్విఘ్నముగా నెర
వేర్చుచున్నారలే ♦ విమలచరిత

గౌత— రక్కసిపింఁడులు ♦ పెక్కు విఘ్నంబులు
నెరపుచున్నారలా ♦ సురవినుత

విష్ణు— యేమి యిక్కట్టుల ♦ వెట్టుల గల్గెనో
క్రమముగా నెఱిఁగింపు ♦ డమరులార

కణ్వ— క్రతువులు వ్రతము లే ♦ మతిముదంబునఁ జేయ
దలఁచిన ఫలములు ♦ దక్కవయ్యె

విష్ణు— యింతటికార్యము ♦ లేనిచోఁ డానరించె
చయ్యన దెల్పుడీ ♦ సంయమీంద్ర!

ఇంద్రు— మాయకుల్ రావణ ♦ మారీచు లిరువురు
సేయు దుండగములు ♦ చెప్పగలమె?

కణ్వ— మిమ్ము నమ్మినవార ♦ లిమ్మయి పలుపాట్లు
బడుచుండనౌనె యీ ♦ పన్నరక్ష!

నార— కష్టమెంతయొ బొంది ♦ నష్టమెంతయు జెంది
తపియించుచుంటిమి ♦ ధన్యచరిత!

బ్రహ్మ— గీ॥ అసుర విసరంబులను ద్రుంచి ♦ యాగములను
సానుకూలంబు జేసినఁ ♦ జాలు మాకు

విష్ణు— వనజసంభవ! పొందు మీ ♦ వాసములకు
వారి యోచింతు రక్షోవ ♦ ధంబుకొరకు॥

నార— కమలాప్రియా! యింకను యోచించుటయే! సరిసరి. మేము జీవించినగదా మీ యోచన.

విష్ణు— నారదా! యేమి యట్లు బల్కెదవు?

ఇంద్రు— దేవా! మా నిలయముల నాశనముజేసి, మమ్ము సాధించి వేధించి చక్కాడుచున్న యీ దుష్టుల బరిమార్చకున్న మాకీ నాకనివాసమేల? క్రతువ్రతమ్ములేల? ఇట్టి మా బాధలు మీరు వేగమ దీర్పకున్న మాకు దిక్కుగలదె?

విష్ణు— అమరులారా! యిక తొందరనొందకుడు. మీ బాధలు దీర్ప నే నయోధ్యాధీశుండును, అర్కకులాధినాధుండును నగు దశరథేశ్వరున కనుంగుబుత్రుండనై రామావతార మెత్తెద. ఈ లక్ష్మియు మిథిలయందు జనకునింట సీతయనుపేర నాకొరకై పెరుగుచుండును. అప్పుడు గూడ సాయముగ దేవతలెల్లరు వానరులై జన్మింపవలెను. పిమ్మట దుష్టులగు రావణాది రక్కసులను బరిమార్చి మిమ్ముద్ధరింతు. ఇంక మీదిగులును మానుఁడు. మీమీ నివాసంబులకుం జనుఁడు. మీ క్రతువుల సాగించుకొనుడు. ఇది పరమ రహస్యమని నమ్ముఁడు. (అదృశ్యుడగును.)

అందరు— కీర్తన. హిం॥ తోడిరాగము - ఆదితాళము.

ఆనందమాయెగా! హరిగనుగొనగను మాకు |
విఘ్నాదర్శన మేమిప్పుడు | స్పష్టముగను
గన నిప్పుడు | ఆహా | ఆనంద |
కాంచానచేలా - కంజాజలోలా |
కరిరాజపాలా |
ఓ! కేశవ | దైత్యారి | మాధవ | మా
ప్రార్థన లాలించి | బ్రోవుమి
నా. రా. యు. ణా ॥ ఆ॥

(నిష్క్రమింతురు.)

(యవనిక జారును.)



ద్వితీయరంగము.



అయోధ్యలో దశరథుని యాస్థానము.

(ప్రవేశము—దశరథుఁడు. వసిష్ఠుఁడు. సుమంత్రుడు, మరికొందరు మునులు.)

దశ—ఆచార్యా! భవదీయ కరుణాకటాక్షముచే పుత్రకామేష్టి సలుప తత్ఫలంబున దివ్యసుందరవిగ్రహులును మాతాపితృ పూజాపరాయణులును దైవభక్తులును నగు బుత్రుల రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల నలువుర కౌసల్య సుమిత్ర కైకయను దేవేరులవలన గని సంతుష్టాంతరంగుఁడనైతి. ఇంతదనుక వారలకువలయు విద్యాబుద్ధులజెప్పి మీరలే పెంచి పెద్దలజేసి యుంటిరి. మీద—

వసి—పంక్తిరథా! యజ్ఞేశ్వరు కరుణచే గల్గినపుత్రులని సామాన్యులని తలఁచుచుంటివి. కాదు కాదు. శ్రీరాముఁడు కేవలము మనుష్యరూపము నెత్తిన వైకుంఠుడుగాని వేరుగాదు. అట్టివేదవేద్యునకు వేరుగ విద్యల జెప్పువార లీయిలంగలరే? అతడీభూభారముదీర్ప నిట్టియవతార మందియుండె. దుష్టశిక్షణము శిష్టరక్షణము గావించి మావంటి వెకదారుల నుద్ధరింప నిట్లవతరించె.

దశ—అయ్యా! మీరెరుంగని విషయంబు లెందును గానరావు. అయిన నట్లే జరుగవచ్చును. ఇపుడు శ్రీరాముని పరిణయవిషయమే విచారణీయాంశము. కావున తగురాచకన్నె యెందుగలదో యెరింగిన నానతీయుడు.

సేవ—మహారాజా! విశ్వామిత్రులవారు హజారమున వేచియుండిరి.

దశ—ఓరీ! యా యతీంద్రుని సత్వరమునఁ దోడ్కొని రమ్ము:

సే—చిత్తము. (అని వెళ్ళును.)

(విశ్వామిత్రుడు ప్రవేశము.)

దశ—గాధినందనా! వందనములు.

విశ్వా—పంక్తిరథా! దీర్ఘాయురస్తు.

దశ—యతికులతిలకా! ఈ యుచితాసన మలంకరింపుడు.

విశ్వా—మంచిది రాజా! నీవును గూర్చుండుము. (ఉభయులును కూర్చుందురు.)

దశ— తే॥గీ॥ ఎచట నుండి మీరెచ్చటి ♦ కేగఁదలఁచి
యిచ్చటికి వచ్చియుంటిరో ♦ సచ్చరిత్ర
మరియు భవదాగమనమున ♦ మద్గృహము ప
విత్రమయ్యె నాజన్మ ప♦ విత్రమయ్యె ॥

సంయమీంద్రా! మీరు త్రిలోకసంచారులు. తమకెరుకబడని నూత నాంశము లుండవు. తాను విచ్చేసినకారణ మెద్దియో సెలవొసంగ వేడెదను.

వి—రాజేంద్రా! నేనొక కార్యము బూనియే వచ్చియుంటి. అద్దాని నెరవేర్చెద నంటివేని దెల్పెద.

ద—చిత్తము. తమవంటి మునిచంద్రులకోరికల నెరవేర్చుటయేగదా మావంటి శుంభినీధవులకు గర్తవ్యము.

వి—రాజా! నేను,

ఉ॥ జన్నము సేయ, రాత్రిచర ♦ సంఘము తన్కరవృత్తి రక్తముఁ
బన్నుగ మాంసమున్, మధువు, ♦ బండలవైచుచు వమ్ముజేతు రా
బన్నముదీర్ప వేగమ కృ ♦ పామతి నోనృపవర్య నీసుతున్
దిన్నగబంపుడయ్య రవి ♦ తేజుని ధీరుని రామచంద్రునిఁ ॥

నేనొనర్చు యాగమునందు రక్తమాంసములు వైచుటయే గాక యాగాలయమం దనేకవిధములగు క్షుద్రకార్యములొనర్చి యాగభంగము గావింపఁ బ్రియత్నించుచుండిరి.

కావున ధనుర్విద్యావిశారదుండగు రాముని బంపితివేని యా దుష్టరాక్షసులనీటు గోటమీటి నాకార్యము సానుకూలము చేయఁగలఁడు. కనుక రాముని బంపఁగోరితిని. ఇంకను ధనుర్వేదమునందలి రహస్యములగొన్ని బోధపరచెదను. మీరుమాటాడక నా వెంట బంపుము.

ద—గాధినందనా!

ఉ॥ రాముని బాసి నేనెటుల ♦ రాజ్యము సేయఁగలాడనయ్య శ్రీ
రాముని బాసి యెట్లు సుఖ ♦ రంబుగనుందు నయోధ్యలోపలన్
సోమునిమించు మోముగల ♦ సుందరమూర్తిని వీడి కాలమున్
గీమున వెళ్ళబుచ్చగల ♦ నే నిముసంబయినన్ మునీశ్వరా॥

వి—దశరథా! నీపుత్రుండు దక్క యితరులెవరు నారక్కసులఁ బరిమార్చువారు లేరు. ఈతెండు చిరుతవయస్కుఁడని మనమున దలంపవలదు. అతఁడు లోకరక్షకుండగు భగవంతుఁడేగాని మానవమాత్రుడుగాడు. లోకకంటకులగు రక్కసులఁ బరిమార్చి రామావతారము ధరించిన విష్ణుమూర్తియని యెంచి నీ మనమునందలిశంక మాని సత్వరంబునఁ బనుపుము.

దశ—(జనాంతికముగా) ఈతఁడు మిగులకోపి. ఇపుడు రాముని బాపకున్న నాపైఁ దన కోపోద్రేకమును బరపి నన్నేమిసేయునో? (ప్రకాశముగా) మునీంద్రచంద్రమా! యినకులోద్ధారకుండగు శ్రీరాముని బాసి నే మనఁజాల; కావున నన్ననుగ్రహింపుము.

(అని పదములు పట్టుకొనును.) (1. అనుబంధము.)

వి—ఓయీ వసిష్ఠా! నేనెంతో నమ్రభావంబున వేడినను నీతనిమనము మరలకున్నది. నీవైన మరల్చి హితోపదేశ మొనరింపుము.

వసి—(తనలో) నేనును మందలించి చూచెదను. (ప్రకాశ) దశరథమహారాజా!

సీ॥ ఇక్ష్వాకుకులమణి ♦ యిటు లనఁబోఁడియె
యున్నతేఁబులాడుఁగ ♦ నర్హమగునె
గాధిపుత్రునిగాంచి ♦ కడుభక్తిఁ బూజించి
యేమిగోరిన నిత్తు ♦ నెలమిగోరుఁ
డనుచుఁబల్కగ నతఁ ♦ డా రాముగోరఁగా
మాటుబల్కుట నీకు ♦ మంచిదగునె
శస్త్రాస్త్రవిద్యల ♦ చవిమెరంగిన యట్టి
కౌశికుతో బంపు ♦ కన్నసుతుని

తే॥ గీ॥ నీదుపుత్రుండు జన్మంబు ♦ నెగడఁజేసి
సకలవిద్యల గ్రహియించి ♦ సరగమరలి
రహి నయోధ్యకువచ్చి శ్రీ ♦ రాముఁ డవల
సర్వసుఖములఁ బడయు ని ♦ స్సంశయముగ॥

పంక్తిరథా! శౌర్యధైర్య గాంభీర్యములయందును సంగరవిజయమందును నీ తనయుని మించువారు సురాసురులందుగూడ గానరారు. నిరాయుధుఁ

డైనను నిశాటకోటిని బరిమార్పఁగల బాహుబలశాలి. ఇట్టి నీతనయునికి మేలొనగూర్ప మనమునఁదలంచి యిక్కాశికుఁ డిచ్చటికి విచ్చేసియుండె. ఇట్టి తపశ్శాలుర వెంట బంపుటకన్న వేరొండు గానబడదు. కాన శీఘ్రముగా నాశీర్వదించి పనుపుము.

దశ—చిత్తము. ఓరీ యెవడురా!

సేవ—అయ్యా!

దశ—ఓరీ! అంతిపురంబునకుం జని రామలక్ష్మణులఁ దోడ్కొనిరమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును.)

(రామ లక్ష్మణుల ప్రవేశము.)

రామ-లక్ష్మ—గురువులారా! నమస్కారము.

దశ—వసి—తనయులారా! శుభమస్తు. (2 అనుబంధము)

రాము—తండ్రీ! మమ్మాగావించిన కతంబేమియో సెలవొసంగ వేడుచుంటిమి.

దశ—తనయులారా! గాధేయుఁడు యాగరక్షణార్థము మిమ్ము సాయముగోరె. కాన నమ్మానివరునియానకు లోనై వారవాక్యములు నిర్వహించి వారి యాశీస్సులఁ బడసి రండు.

విశ్వా—దశరథా! యిప్పటికే చాలజాగైనది. నే నేగవలయు. నీ తనయులను బనుపుము. వెళ్ళెదను.

దశ—చిత్తము. మహానీంద్రా!

తే॥ గీ॥ ఆకటికి నిద్రకోర్వని ♦ యనుగులనక
నీ యభీష్టంబుఁదీర్ప న ♦ మేయభక్తి
బంపుచున్నాడ నినునమ్మి ♦ వారి నీట
ముంచెదో పాలముంచెదో ♦ మునివరేణ్య॥

తండ్రులారా! యీసంయమీంద్రుని వెంటఁ బోయిరండు. (3 అనుబంధము)

రామ—తండ్రీ! సెలవొసంగుడు, పోయివచ్చెదము.

దశ—తండ్రులారా! యినకులోద్ధారకులని ఖ్యాతిగాంచుడు.

రామ—తండ్రీ! మీ యనుగ్రహము గలుగ మాకేవేళ నెందు నేకొఱంతయు నుండనేరదు.

విశ్వా—దశరథా! నీవు నిలువుము. ఇంక తడవుసేయరాదు. పోయివచ్చెదము.

దశ—చిత్తము.

(విశ్వామిత్రుఁడు, రామలక్ష్మణులు నిష్క్రమించుచున్నారు.)

## తృతీయరంగము-అరణ్యము.

(శరములతో రాముడు, లక్ష్మణుడు, విశ్వామిత్రుడు పునఃప్రవేశము.)

విశ్వా—రామచంద్రా! అల్లదేచూడు! దుష్టరక్కసియగు తాటకి మనల డీకొన నికే వచ్చుచున్నది. దాని నొక్కకోలచే మట్టుబెట్టుము.

రాము—గురువరా! స్త్రీని జంపుట పాపముకదా. ఇట్టికార్య మెట్లొనరించగలను?

విశ్వా—రామా! యినకులవార్ధిసోమా!

గీ॥ స్త్రీలజంపుట పాపంబు ♦ క్షితి నిజంబె
మన మొనర్చు సత్కార్యముల్ ♦ మంటగలుప
భీకరాకృతితో వచ్చెఁ ♦ బిడుగురీతి
దీని జంప సందియమేల ♦ ధీవరేణ్య!

రాక్షసాంగనయగుటచే దీనిఁ బరిమార్చిన పాతకము రాజాలదు. సత్వరమ సాహసించుము.

రామ—చిత్తము. అట్లయిన మీయాజ్ఞానుసారము వర్తించెద. (తమ్మునిఁజూచి.)

క॥ తమ్ముఁడ! కనుమీరక్కసి
నమ్ముల చేఁబూని పీచ ♦ మడగగ దానిన్
ఖమ్మడరఁగ మహిపడకఁగ
నమ్మతి ఖండింపు మీవు ♦ సంయమియాజ్ఞన్.

లక్ష్మ—అన్నయ్యా!

ఉ॥ తాటకి గీటడంచఁగను ♦ దాపసియాజ్ఞ వహించినాడ నే
గాటపుబాణజాలములఁ ♦ గామినిపై నిడఁజాలనన్న! యీ
బోటిని నాసికాశ్రవణ ♦ ముల్ దెగగోసి విరూపిజేసెదన్
మాట లికేటికయ్యా మరి ♦ మానినిఁ దుంచఁగఁ జేతులాడునే॥

తాట—ఓరోరి మానవాధములారా! నిర్జనప్రదేశంబగు నా ఘోరారణ్యమేల జొచ్చితిరి? నేడు తొలిముద్దగ మిమ్ముఁ గబళించెద. వెరచి పారకుడు! (అని రామునిపైకి దుముకును.)

రాము— ఉత్సాహము

మమ్ము మ్రింగ నెంచినావె ♦ మాయలాడి రక్కసీ
పొమ్ము వేగఁ గూయకుండ ♦ పొదలచాటుమాటునన్॥

తాటకి— ఉత్సాహము

రమ్ము నన్ను ద్రుంచ వేగ ♦ రాచబిడ్డ వేగమే
పొమ్మటంచు బల్కనేల ♦ పోటుతనముఁ జూపరా॥

రాము—ఆ, యేమీ! నాపోటుతనము జూపవలెనా?

క॥ చచ్చెదు నాచేతోలన్
వచ్చెను రాముండు దనుజ ♦ వధ నొనరింపన్
జెచ్చెర విలిచెద నిల్వుమి
యిచ్చెరవా నిన్నుజూడ ♦ నాహవమందున్॥
(అని బాణముశేయును. తాటకి నేలబడి)

తాటకి— హా! చచ్చితి చచ్చితి. (అని తన్నుకొనుచు ప్రాణములువిడుచును.)

విశ్వా—రఘునందనా! తాటకిని గోటమీటితివి. సర్వజనులకు సంతసంబయ్యెగాన నిక నిజాశ్రమంబున కరుగుదము రమ్ము.

రాము—చిత్తము. (అని నడచుచుందురు.)

విశ్వా—రామచంద్రా! మదీయసవనాలయ మిదియే. నేను యజ్ఞదీక్షల బూనెదం గాన మీరలు శస్త్రాస్త్రంబులు ధరియించి జాగరూకతతో నుండుడు. ఆ దుష్టరాక్షసు లనేకమాయలు పన్నెదరు. అట్టి మాయలెల్ల నతిజాగ్రత్తతో నరయుడి, నేనేగెద.

రాము—చిత్తము. తమయాజ్ఞ శిరసావహించి యట్లే కాచియుందుము.

(విశ్వామిత్రుడు నిష్క్రమించును.)

రాము—తమ్ముడా! దుష్టరాక్షసు లదృశ్యరూపులై రక్తమును ధారగా బోయుచుండిరి. వారల నిప్పుడ మట్టుబెట్టెద. నావాయవ్యాస్త్రంబు సత్వరంబిమ్ము. (లక్ష్మణుడు బాణమిచ్చును. రాముడు అందుకొని బాణమువిడుచును. అంత సుబాహుడు క్రిందబడి చచ్చును. మారీచుడు పరువిడును.)

రాము— తే॥గీ॥ అనుజ! కనుగొను దనుజుల ♦ పనుల నెల్ల
మింట నిలిచిటుగురిపింతు ♦ రంటువిడని
రక్తధారల నీ యధ్వ ♦ రంబు సెరువం
జెడుటకై కావె వీరికి ♦ వెడగుబుద్ధి॥

లక్ష్మణా! మారీచసుబాహులనెడి యీ యధమదానవులే కౌశికుని వ్రతనిష్ఠకుం బ్రతిబంధకములం గల్పించుచుండిరి. మన కౌశికుని యాగమునకు నేడు కడసారిదినమగుటచే జన్నమునకు పూర్ణాహుతియు నాశరమునకు వీరాహుతియు నగుట సమకూడినవి.

లక్ష్మ—అన్నయ్యా! యీ నిశాచరు లెన్నెన్నిమాయల బన్నుచు మింట జరించుచుండిరి! కనుకనే రక్కసులు మాయలమారు లందురు.

రాము—అవును. మనగురువుగారును నిటేవచ్చుచున్నారు.

(విశ్వామిత్రుడు ప్రవేశము.)

రాము—గురువరా! నమస్కారము.

విశ్వా—రఘుకులతిలకా! శుభమగుగాక!

రాము—మునిపుంగవా! యజ్ఞభంగము గావింపఁ బ్రయత్నించిన సుబాహువను రక్కసుని గనుము. గగనమార్గమున మిట్టిపడుచుండ నీతని మట్టుపెట్టితిని. (అని చూపును.)

విశ్వా—కదనవిజయరామా! అమందానందముఁ డనైతి. రామచంద్రా! మిథిలయందు జనకమహారా జొనరించు యాగము జూడ ననేక మునిపుంగవులు పోవుచుండిరి. మనము నటకు పోవుదము రండు. అచ్చట,

క॥ శంకరుచాపము గలదట
జంకక యది యెక్కు వెట్ట ♦ జాలినచో ని
శ్శంకగ సీత నొసంగెద
పొంకముతోనంచు దెలిపె ♦ భూరమణుండున్॥

కావున నచ్చటి కనేక దేశాధీశు లావిల్లు నెక్కువెట్ట వచ్చియుండిరట. మనముకూడ నటకు పోదమురండు. వీలైనయెడల నాకార్యమునకు మీరును బ్రయత్నింపవచ్చును.

రాము—తమ యనుగ్రహమున్న బ్రయత్నింపకేమి?

విశ్వా—రండు పోదము.

రామ-లక్ష్మ—చిత్తము. (అని కొంచెము నడచి) మునివరా! ఈ యాశ్రమ మెవరిది?

విశ్వా—రామచంద్రా! ఇది గౌతమాశ్రమము. గౌతమపత్నియగు నహల్య శాపవశముచే పాషాణాకృతిదాల్చి పడియున్నది. అల్లదే చూడుము.

రాము—గురువరా! ఇదేనా? (అని రాతిని తన్నును.)

(అంత నహల్య నిజరూపముతో నిలిచి) (4 అనుబంధము)

అహల్య—గీ॥ రామచంద్రాయ లోకసం ♦ రక్షకాయ
వందనంబులు పదివేల ♦ వందనములు
మేల్మి మీపదధూళి నా ♦ మేనసోకి
నన్నిపాపము లడుగంటె ♦ నయ్య నేడు॥

రామచంద్రా! యనేక వర్షములనుండి యీ కారడవిని శిలనై యుంటి. నేటికి మీపదసరోజపరాగంబుచే శాపవిముక్తి నొందితిఁ గాని శిలామయమైన నా తనువును తాకుటచేత మీ మృదుపదంబు లెంత నొచ్చెనో కదా! మీ పదసేవజేసెద. న న్ననుగ్రహింపుఁడు.

(అని పాదములపైఁ బడును.)

రామ—(లేవదీసి)

గీ॥ తమ్మికంటిరో! లెమ్మింక • సమ్మదముగ, నీదు శాపంబు నేటితో • నీటగలిసె
నింక పతిచెంత కేగు ని • శ్శంగ తోడ, నతులగుణ సుమాంగల్య యహల్య నీవు

అహల్యా! నీ నాథుండగు గౌతముఁడు సిద్ధచారణ సేవితంబైన హిమ గిరియందు దపమాచరించుచుండె. నీవును నా వడకుగుబ్బలికి జని నీ నాథుని గూడి సుమంగలివై సుఖముగా నుండుము. పొమ్ము.

అహ—రామచంద్రా! మహాప్రసాదము.

రామ—మంచిది పొమ్ము. (అహల్య నిష్క్రమించును.)

విశ్వా—రామచంద్రా! మిథిలానగర మిచ్చటి కర్ధయోజనమం దున్నది.

చ॥ జనకుని యాగమున్నదగ • చయ్యన రండిక జాగు చేయ కీ
వనము నతిక్రమించవలె • వానిపురంబును జేర నిత్తఱిఁ
గనుగొన నంధకారమిక • గప్పదొడంగెడి నంతెగాక స
న్మునివరులంద రేగిరి ప్ర • మోదముతోఁ దుత యజ్ఞశాలకున్॥

రామచంద్రా! జాగు సేయక రండు పోదము. (నిష్క్రమించును.)



తురీయరంగము—మిథిలానగరము: జనకుని యాస్థానము

(కొందరు మునులు, వివిధదేశాధీశులును నాసీనులై యుందురు.)

జన—మంత్రీ! జన్నముకొఱకు సకలమునిజను లిదివరకే వచ్చియుండిరి. శంకరు చాపమెత్తి నా ముద్దులపట్టిని గ్రహించుటకై సకల దేశాధీశు లును విచ్చేసిరా?

మంత్రి—బుధిలేశా!

సీ॥ మాళవ, కేరళ, • మగధాంధ్ర, సౌరాష్ట్ర,
పాంచాల, బర్బర • పార్థివులును
సింధు, వంగ, కళింగ • సింహళ, శక, గౌళ,
కాశ్మీర, బాహ్లీక, కాశపతులు
కుకురు, కరూశాది, • కోసల, కొంకణ,
కొంకణ, పాండ్యాది • కులలవరులు
భోజ, కుళింద, కాం • భోజ, కుంతల, చోళ,
లాట, చేది, మరాట • రాజులెల్ల

తే॥ గీ॥ వచ్చియుండిరి కొల్వున • కచ్చెరువుగ
ముచ్చటలుమీఱ మీసుత • నిచ్చటికిని

వచ్చునట్టులఁ జేయుడీ ♦ సచ్చరిత్ర
జనకభూపాల సద్గుణ ♦ గణ సుశీల॥

(అంత రామలక్ష్మణ విశ్వామిత్రులు పునఃప్రవేశము)

జన—గాధినందనా! నమస్కారము.

విశ్వా—దీర్ఘాయురస్తు.

జన—తే॥ గీ॥ గాధినందన! నాయాగ ♦ కార్యమునకు
వచ్చితిరి నేడు ధన్యుండ ♦ వసుధ నాదు
యాగఫలమిప్డు పండె జూ, ♦ యతితిలకేంద్ర!
జన్నము సమాప్తి నొందించి ♦ చనుఁడు మీరు॥
సంయమీంద్రా!

ఉ॥ భూరిబలాఢ్యులీ శిశువు ♦ బుద్ధికిబెద్ద లోకేవయస్కులున్
ధీరులువీరలిక్ష్వాకున తేజులె ♦ వానికి పుత్రులయ్యా? యా
కారముఁ జూడఁజూడఁగను ♦ కన్నులపండువు గల్గెనయ్యా స
ద్గౌరవముంచి జెప్పుడీఁక ♦ గాధితనూభవ మీకు మ్రొక్కెదన్.

విశ్వా—జనకమహారాజా! వీరు రామలక్ష్మణు లనువారు. అయోధ్యాపురవాసులు. ఇనకులోద్భవుండైన దశరథమహారాజు కుమారులు. వీరలు,

ఉ॥ తాటకిరూపుమాపి, ఘన ♦ దర్పితుఁడైన సుబాహునిన్ వడిన్
గాటికిబంచి సత్వరమ ♦ గౌతమపత్నికి శాపమోక్షమున్
ధాటిగఁజేసి తా మతిము ♦ దంబున వచ్చిరి నీ గృహంబునన్
జాటఁగనున్న శంకరుని ♦ చాపము నెక్కిడఁబూని యుత్తరిన్॥

జన—చిత్తము. అట్టులే చేయవచ్చును. (సభజూచి)

ఉ॥ భూపకుమారులార! కడు ♦ భూరిపరాక్రమశాలులార! యీ
చాపము నెక్కువెట్టగల ♦ క్ష్మాతలనాథున కిత్తుజానకిన్
నాపయిగూర్మినించి యిట ♦ నల్వురిలో భుజవిక్రమంబునన్
పాపలు పెద్దలంచనక ♦ పట్టిన పట్టున నెక్కువెట్టుడీ॥

పూజ్యులగు రాజకుమారులారా! తీవ్రగతి నికార్యమునకు నుద్యుక్తులుగండు.

రాము—గురువరా! అనుజ్ఞ నొసంగుడు.

విశ్వా—రామా! సద్గుణస్తోమా?

గీ॥ ధనువు జేపట్టి యెల్లర ♦ మనము లలర|నారిబిగియించి శస్త్రసం ♦ధాన మొనర
జేయుమీ రామ! యెల్లజే ♦ జేలువొగడ|రాముఁడీతడు కోదండ ♦ రాముడంచు.

రామ—చిత్తము. లోకారాధ్యులగు నో మునిపుంగవులారా! సర్వసంపత్పరిపూర్ణు
లగు నో కుంభిసీధవులారా! సెలవొసంగ వేడుచుంటి. (అని యెత్తబోవును.

( 5 అనుబంధము. )

విశ్వా—గీ॥ కదలబోకు వసుంధర! ♦ కాస్యపి దగఁ
బట్టుకొమ్ము నాగేంద్ర! ధరా ♦ ఘనులఁబట్టు
కొమ్ము కూర్మమ! శివునిచా ♦ పమ్ము నెక్కు
పెట్టుచున్నాడు దశరథు ♦ పట్టియిపుడు॥

(రాముడు విల్లెక్కిడబోవ మధ్యకు విరుగును. సీత పూలహారము
రామునిమెడలో వేయును. రాజులుపోవుదురు.)

( 6 అనుబంధము. )

మునులు—శ్లో॥ జయతు జయతు రామా! జానకీచిత్తకామా!
జయతు గిరిశమిత్రా! సారసాప్తాబ్జనేత్రా!
జయతు శుభచరిత్రా! శ్యామలోపేత గాత్రా!
జయతు విబుధకల్పా! సర్వరాజేంద్రతల్పా!

జన—మంత్రీ! శ్రీరాముని యవక్ర పరాక్రమంబెల్ల వర్ణించుచు అయోధ్యా
పురంబున కొకశుభలేఖ నిట్టు వ్రాయుము. మీ పుత్రరత్నమగు శ్రీరా
ముడు శంకరుచాపముం దునిమి సర్వమునిజనన్నృపాలసమ్ముఖమం దుత్తీర్ణు
డయ్యెగాన నాపుత్రికయగు జానకినిచ్చి వివాహము సేయ నిశ్చయించితిని.
మీరద తమరు పుత్రమిత్రామాత్య పరివార బంధుసహితంబుగా మిథిలాపురికి
విచ్చేసి పరిణయము నిర్వర్తింతురుగాక—అని వ్రాయుము.

మంత్రి—చిత్తము. (అని లేఖవ్రాసి) దేవా! చిత్తగించుడు.

తే॥ గీ॥ రాజరాజేంద్రపూజ్యులై ♦ గ్రాలుచున్న
పంక్తిరథునకు జనకుండు ♦ ప్రణుతిజేసి
వ్రాసికొన్నట్టి శుభలేఖ ♦ నరుసవినుడు
మిథిలలోమాకు క్షేమంబు ♦ మీకు శుభము.

అవక్రపరాక్రముండైనమీతనయుండు చిరంజీవియగు శ్రీరామభూపాలున
కస్మత్ పుత్రికయగు సీతాదేవినిచ్చి చైత్రశుద్ధ నవమి భానువాసరంబున
పగలు పదునాలుగు ఘడియలమీదట పూర్వఫల్గునీ నక్షత్రయుక్త మిథున
లగ్నమున వివాహముచేయ పెద్దలు నిశ్చయించినారుగాన మీరు పుత్రమిత్రా
మాత్య పరివారసహితముగా మిథిలానగరమునకు దయచేయ ప్రార్థితులు.

మిథిలానగరము. } ఇట్లు భవద్విధేయుడు,
జనకుడు.

జన—మంత్రీ! యీశుభలేఖ నయోధ్యాపురంబునకు బనిచి యిక్ష్వాకుకులోద్ధార కుండైన దశరథేశ్వరుని మిధిలానగరమునకు వచ్చునట్లు సేయుము.

మంత్రి—చిత్తము, అట్లనే చేసెద.

జన—కులకులేంద్రా! రామచంద్రా! కల్యాణమండప మలంకరింప దయసేయుడు.

రాము—చిత్తము. గురువరా! దయచేయుడు. (అందరు నిష్క్రమింతురు.)

(యవనిక జారును.)

(వసిష్ఠ, విశ్వామిత్ర, దశరథ, సీతా రామ లక్ష్మణులు పునఃప్రవేశము)

రాము—గురువరా! అల్లదే అటు జూడుడు.

తే॥ గీ॥ నభముజూడగ కప్పుతో ♦ నంటుకాదె
గతినిగానక మదిచప ♦ లత వహించి
జంతువితతి వాతోద్ధూత ♦ జలధరముల
భాతిఁ జెదరి కుయ్యిడు చుండె ♦ బహువిధముల॥

గురువులారా! దేశమెల్ల నంధకారబంధురంబయ్యె. (ఆలకించి) ఏమీ యీ సవ్వడి! ధనుష్టంకార మొనర్చుచుండిరి! ఇట్టిఘోరారణ్యమునం దీయర్ధరాత్రిమున నెవ్వరీధనుష్టంకార మొనర్చుచున్నారు?

(కోపముతో పరశురాముడు ప్రవేశము) (7 అనుబంధము)

రాము—అయ్యా! నమస్కరోమి

పరశు—మత్త॥ ఓరి శంభుని ప్రాతచాపము ♦ నొంచినావని వింటి నీ
ధీరతంబొగడంగఁ జాలిన ♦ ధీరు లీభువిలేరు, పా
ల్వారబారక నాదుసింగిణి ♦ నాడెమొప్పఁగ ద్రుంచి నీ
పేరు ధారుణి నిల్పుకొమ్మిక ♦ విక్రమాఢ్యుఁడ వైనవోఁ॥

రాముఁడ నేనుండ వేరొండురాముఁ డుండదగునా! నన్నును నాచాపమును నతిస్వల్పముగా నెంచుచుంటివా? ఇద్ధరాచక్రంబేలు ధరాధిపులతలల నిరువదియొక్కమారు ఖండించి స్వర్గమునకు సోపానము లమర్చితి. విలువిద్యయందు శంకరునోడించి మించితి. ఇట్టి పేరుఁడనగు నాకు చెల్లుగాక రామ శబ్దము నీకు సార్థకమగునా? జనకునింట పుచ్చిన సింగిణి యనుకొంటివా విరుచుటకు? వేయేల! కదనమునకు రమ్ము. లేకున్న నొక్కపరి కేల్మోగిచి పొమ్ము.

రాము—అయ్యా! భార్గవరామా!

గీ॥ మునులయందున సద్గురు ♦ మూర్తివనుచు
పుడమిసురలందు సురుచిర ♦ పుణ్యుఁడనుచు

మ్రొక్కితినిగాని మీామది ♦ ముఖ్యమటుల
నున్న నే నాజిసేయఁగ ♦ నున్నవాఁడ॥

పర—అటులనా? పాపము యెంతకనికరము దలఁచితివి. మునిజనులైననేమి? నీవు రాజవంశ సంభూతుడవై క్షాత్రధర్మము నిలుపుకొన దలచితివేని రణమ్మునకు రమ్ము. లేకున్న నమస్కరించి పొమ్ము.

రాము—ఆ! యేమీ! భార్గవరామా! కదనమందు నమస్కరించవలెనా?

ఉ॥ పాఱుఁడ నిన్ను దుంచినను ♦ బాతకమంచు మదిందలంచితిన్
గాఱులు పేలెదే ఖళిర ♦ కయ్యమునన్ దెగటారువాఁడవే
ధీరుఁడు రాముఁడం చనక ♦ కేలికగా ననుజూచె గారవ ఛీ!
పోరొనరించిరన్ వడిగఁ ♦ బొందెదు స్వర్గపదంబు నిత్తరిన్ ॥

(అని శరము విడుచును.)

(అంత పరశురాముఁడు దండప్రణామము గావించి)

పరశు— గీ॥ నీదు మహిమం బెఱుంగక ♦ నేను చాల
మేరమీరుచు బల్కితి ♦ మేదినీశ!
నీవు శ్రీవిష్ణుమూర్తివి ♦ నిగమవేద్య
నాదుతప్పులు సైరించు ♦ నతులొనర్తు॥

రామచంద్రా! నేను మహేంద్రాద్రికిం జని నారాయణ చరణంబు శరణంబుగా కాలము గడపెద, ననుజ్ఞ యొసఁగుడు.

రాము—మంచిది, అటులనే పొండు.

(పరశురాముడు నిష్క్రమించును.)

రాము—గురువులారా! చాల తడవయ్యె. పోవుదము రండు.

విశ్వా—అటులనే పోవుదము.

(అందరు నిష్క్రమింతురు.)

ప్రథమాంకము—సంపూర్ణము.





శ్రీ

# సంపూర్ణ రామాయణము

## ద్వితీయాంకము



### ప్రథమరంగము—అయోధ్యానగరము

(వసిష్ఠ, దశరథ, సుమంత్రులును, కొందరు మునులును కూర్చుందురు)

దశ—గురువరా! మునిపుంగవులారా!

తే॥ గీ॥ సకలభోగంబులనుగంటి ♦ సరసగతిని
పెద్దకాలంబు నేలితి ♦ పృథ్వినెల్ల
సుగుణనిధులని పేర్కొన ♦ దగినయట్టి
పుత్రులను గంటి నిగమన ♦ మూహముగను॥

క॥ సుతులందు నగ్రజుండును
మతిమంతుడు ధీరుడైన ♦ మా రామునకున్
హితముగఁ బట్టముఁగట్టగ
మతిదలచుచు నుంటినయ్య ♦ మౌనివరేణ్యా॥

నేనిప్పటికి వయోవృద్ధుడ నైతి. కిరీటభారమును భరింపఁజాలకున్నాడ. కాన శ్రీరామునకు బట్టముఁగట్టి విశ్వవిశ్వంభరాభరంబెల్ల భరింప నాతని నియోగింప త్రికాలజ్ఞులగు తమ సెలవు గోరుచుంటి.

వసి— గీ॥ రమణ గుణైకుడు శ్రీరఘు ♦ రాము బిలిచి
వరగ నీకోర్కెఁ దెల్పుమి ♦ ప్పట్ల వేడ్క
నతనిసమ్మతిఁ గైకొని ♦ యవల మనము
కార్య మారంభమును జేయఁ ♦ గడగఁదగును॥

దశ—చిత్తము. ఎవడురా అక్కడ?

సేవ—అయ్యా! సేవకుడు.

దశ—ఓరీ! శ్రీరాముని నిటు దోడ్కొనిరమ్ము. (సేవకుడు నిష్క్రమించును.)

వసి—దశరథమహారాజా! శ్రీరాముని యభిప్రాయము నెరింగినపిదప నట్టి కార్యమున కుపక్రమించవలెను సుమీ.

దశ—చిత్తము. అదిగో శ్రీరాముడిదే వచ్చుచున్నాడు.

(రాముడు ప్రవేశము.)

రామ—త్రికాలవేదులగు మునిపుంగవులారా! అభివాదనము. జనకా! నమస్కారము.

ముని—విజయోస్తు. విజయోస్తు.

దశ—శీఘ్రమేవ రాజ్యాభిషేక ప్రాప్తిరస్తు. తనయా!

ఆ॥ వె॥ పెద్దవాడనైతి ♦ పృథ్వీభరంబింక
మోయజాలనయ్య ♦ పుత్ర! మరియు
నీకు దీని నొసగి ♦ నా కన్నులారంగ
గాంచగోరి పిలువ ♦ బంపినాడ॥

ఇందుకు నీ యభిమతం బెట్టులుండె నెరింగింపుము.

రాము—జనకా! నేను నీయభిప్రాయంబు నతిక్రమించి వేరుగ నడతునా? నీ యభిమతమే నా యభిమతము.

ముని—మేలు రామచంద్రా! మేలు! పలుకదగినమాట పలికితివి.?

దశ—మునివరులారా! వింటిరికదా! సుతునిసమ్మతి. ఇంక తమయాజ్ఞ యెట్లుండెనో సెలవీయ వేడుచున్నాడ.

వసి—శ్రీరామమూర్తి సెలవయిన వెనుక మాయాజ్ఞ వేరుగనుండునా? శుభస్య శీఘ్రమ్మనినట్లు వెంటనే పట్టాభిషేకమహోత్సవము గావింపుము. నేటికి మూడవదినమందే శుభముహూర్తము గలదు.

ముని—ఔను రాజా! తప్పక యట్లు కావింపుము. మా కనుష్ఠానకాలం బగుచున్నది. పోయివచ్చెదము.

(మునులు నిష్క్రమింతురు.)

దశ—రామభద్రా! పట్టాభిషేకోత్సవ ప్రయత్నములు చేయుటకు మనము త్వరపడవలసి యున్నది. పోవుదమురమ్ము.

రాము—చిత్తము. (నిష్క్రమింతురు.)

(మంధర ప్రవేశము)

మంథ—(తనలో) ఈ రాజసభలో నేడు జరిగినప్రసంగము నంతను ఈ చెంతనుండి నేను వినుచున్నాను. అట్లు పొంచి యితరులరహస్యములు వినుట నా స్వభావము.

ఇప్పుడు రామునకట పట్టాభిషేకమట. ఇంతటి శుభకార్యము నేమ జూచి యోర్వగలనా? నాకనులోర్చునా? ఇదిగాక రాముని పేరు వినఁగానే నాకు అరకాలిమంట తలకెక్కుచుండును. ఇపుడేమిచేయుదును?

తే॥ గీ॥ రాముఁ డనగను నామది ♦ రగులుచుండు
రగిలి నేనేమిచేయుదు ♦ రణసుధీరు
నేమిసేయుదు? నావల్ల ♦ నేమికాదు
తొల్లి నను మోదె సభలోన ♦ నల్లనముగ॥

అప్పటినుండియు రాముని వంచింపవలెనని మనమున దలఁచుచుంటిని. సమయము రాదయ్యె. చిన్నప్పటినుండియు నాస్వభావము దుస్స్వభావమై నను సమయము రానిది దుస్స్వభావ మక్కఱకు వచ్చునాయని మిన్నకుంటిని. నా స్వభావమేమన,

సీ॥ నామాటలను విని ♦ నమ్మినవారికి
సిగపట్లు పట్టగాఁ ♦ జేయఁగలను
అనతికాలంబులో ♦ వినతులుగావించి
బుద్ధికలంగఁగా ♦ పోరఁగలను
అరచేత వైకుంఠ ♦ మటుచూపి నమ్మించి
గురుశుభంబులు చెడఁ ♦ గొట్టగలను
దాంపత్యములు వీడ ♦ దంపిపెట్టి రగిల్చి
బలె సెబాసన వేరు ♦ పరచఁగలను

తే॥ గీ॥ తల్లిబిడ్డల నెనబాపి ♦ దయలమాపి
అన్నదమ్ముల నేస్తంబు ♦ సున్న జేసి
తలల పగఁగోయునంతటి ♦ శాస్త్రమైన
జేతులారంగఁ బాంగుచు ♦ జేయఁగలను॥

కైకేయికి సైతము నాలో సగ మశీనమున్నది. ఎట్లయిన రామునికి పట్టము గిట్టకుండఁగ జేయుంచెద. ఇంక జాగుసేయరాదు. కైకయింతి పురంబునకుఁ జని కలవి లేనివి కల్పించి కయ్యము బెంచెద.

(అని నిష్క్రమించును.)

---

ద్వితీయరంగము - కైకమందిరము.

(కైక మందిరమున ముసుగిడి నేల పరుండును. దశరథుఁడు ప్రవేశించును)

దశ — (తనలో) విద్యుత్కాంతులీను నాదేవేరిసౌధరాజ మేలోకో యంధకార బంధురమై నేడు కన్పట్టుచున్నది.

ఉ॥ సారసహీనమౌ కొలను ♦ శారికలార్వని పంజరంబు ని
స్సారముజెందు చందురుడు ♦ సాహిణిలేని తురంగశిక్ష మేల్
సారసవైరిలేని సుని ♦ శం బడవిన్ విరజల్లు చంద్రికల్
పోలికనుండె నంగనకు ♦ పౌష్పిసుమంతయు గాన మిర్యోడన్॥

(ఆశ్చర్యముతో) ఏమీ యొక్క చేటికైన గానరాకున్నదే!

(దిక్కులుచూచి)

తే॥ గీ॥ కోపమునుబూని కైకేయి ♦ కోర్కెలేమొ
దీరనట్టుగ శయనించె ♦ దీనదశను
రత్నమణిమయభూషల ♦ రక్తిపీడి
మైలవలువలు ధరియించి ♦ మందిరమున.

దేవేరి యిట్లు కినుకఁబూనుకారణ మేమైయుండును? (ఆలోచించి) సహజ కోపస్వభావులకు అన్నియు నేరములుగనే కన్పట్టును. (దగ్గరజేరి) దేవీ!

చ॥ అలుకవహింపనేల మలి ♦ నాంబరముల్ ధరియింపనేల ని
శ్చలముగనుండనేల మెయి ♦ చాయగృశింపఁగ గుందనేల చిం
తలఁబడి కాగ్రినేలఁ గల ♦ దానివచింపగ జాగికేల స
ల్లలితముఖాబ్జ మిత్తరి వ ♦ శత్వము వారఁగనేల భామినీ॥

మదగజయానా! దీనవదనారవిందవై చింతాక్రాంతచిత్తముతో వంతలకు లోఁబడనేల? నీ కపరాధమొనర్చిన దుష్టస్వభావు లెవ్వరైనను సరే తప్పక శిక్షించెదను. దాచక చెప్పుము.

సీ॥ సవతులు నిన్ జూచి ♦ చౌకచేసిరొ చెప్పు
శిక్షింతువారలఁ ♦ జింతమాని
దాసదాసీజనుల్ ♦ తప్పుజేసిరటన్న
తలలుద్రుంచెద వారి ♦ దలపుదీరఁగ
పాటింపకయె పెరల్ ♦ మాటమీరిరటన్న
దండించెదనువారి ♦ దక్షిణంబ
యాభరణములపై ♦ నాశయుండిన జెప్పు
కోర్కెఁదీరగఁదెత్తుఁ ♦ కొనుపలేక

తే॥ గీ॥ లేక నాయెడ నపరాధ ♦ లేశమున్న
దెల్పి క్షమియించి ప్రోవుమీ ♦ తెల్లముగను
తప్పులన్నియు సైరించు ♦ మొప్పులుగను
పగలఁబొగులఁగనేల యో ♦ వనజవదన॥

(అని పట్టుకొనబోవును) (9 అనుబంధము)

కైక—(కోపముతో)

తే॥ గీ॥ పురుషు లెన్నెన్నొ మాటలిం ♦ పుగను జెప్పి
యక్కరలు దీర నావల ♦ నతివ ముగము
జూడరను సామ్య మిచ్చోట ♦ నేడుదెలిసెఁ
జనుడు కౌసల్యయింటికి ♦ జనుఁడు చనుఁడు॥

దశ—ఓహో! ఇదియా నీ కోపకారణము ఇందువదనా!

తే॥ గీ॥ పేరునకు నెంచ కౌసల్య ♦ పెద్దభార్య
ప్రేమయంతయు నీకడ ♦ పెరుగుచుండు
యీసునను బల్కుటేగాని ♦ యివ్వడేను
సర్వమును నీదికాదె ని ♦ శ్చయము సుమ్ము॥

కైక—ఈ యుక్తుల కేమిలెండు.

దశ—ఇందు యుక్తులేమున్నవి? నీవడిగిన ప్రాణము సైత మర్పింతును.

కైక—ప్రాణములనైన నిచ్చెదరా?

దశ—ఆహా! ముమ్మాటికి తప్పక యిచ్చెదను.

కైక—మంచిది. నాథా! తొల్లి నే సంగరవిజయము గాంచినప్పుడు వరము లిచ్చెద
నని పల్కియుంటిరిగదా.

దశ—అవును. ఇచ్చెదనని పల్కియుంటి.

కైక—అప్పుడు నేనావరములను వలయునప్పుడు కోరెదననియు నట్టితరి దయసేయ
వలయుననియు కోరియుంటిని. అందులకు దేవరవా రంగీకరించిరి. నాటి
వరములు నేడీయవలయు ఇచ్చెదరా?

దశ—సఖీ! యింతమాత్రమునకా యింతగోడవ? తప్పక యిచ్చెదను.

కైక—నాథా! యిచ్చెదనని చేతిలో చేయి వేయుడు!

దశ—ప్రేయసీ! చేతిలో చేయి వేయవలయునా? ఈ దశరథుఁ డాడితప్పువాడా? దశర
థుఁడేకాదు, ఈతని వంశజు లెవ్వరైన నసత్యము లాడియుండిరా? ఇదిగో
యిటు వినుము. (10 అనుబంధము.)

ఉ॥ భానుఁడు త్రోవదప్పినను ♦ భానుకులంబు కలంకజెందినన్
సూనులు దూరులైన ధన ♦ శూన్యత గల్గిన రాజ్యమంత ని
ర్మానుషమౌచుఁ బోయినను ♦ మానక వార్నిధు లింకిపోయినన్
చానరో! పల్కువాఁడనె యీ ♦ సత్యపువాక్కులు జిహ్వఁ గోసినన్॥

కైక—నాథా! అట్లయిన నాకీవరము లీయవలయు.

తే॥ గీ॥ పట్టభద్రుని జేయుఁడీ ♦ భరతు నొకట
పరగ రాముని వనములఁ ♦ బదియునాల్గు

వత్సరములుండఁ బంపుడీ ♦ వసుమతీశ!
నేను గోరెడు వరము లి ♦ వేను రెండు॥

మనోహరా! నాకీ రెండువరము లొసఁగుఁడు. అంతియె చాలు. తృప్తి నొందెద.

దశ— హా! రఘురామా! నీలమేఘశ్యామా! సజ్జనస్తోమా! నా చిన్నితనయా! నిన్నేగతి నెడఁబాయుదురా తండ్రీ! (కోపముతో) ఓసీ! మాయలాడీ! యెంత ఘోరము గావించితివే! కైకా! నీపల్కులు వినినది మొదలు నా గుండె లవిసిపోవుచున్నవే. వేరొండు గోరుము. కావున్న,

తే॥ గీ॥ నీవు గోరినయట్టులె ♦ నిక్కముగను
పట్టభద్రుని జేసెద ♦ భరతసుతుని
రామచంద్రుని వని కంపి ♦ బ్రతుకజాల
రెండవవరంబు కోరు వే ♦ రొండు వెదకి॥

అయ్యో! నీమాట తలంచినంతనే నాగుండె వకావక లగుచున్నది.

కైక— నాథా! మీరు వరము లియ్యకున్న నాకేమి చింత లేదుగాని ఇక్ష్వాకు కులమున మీరు జనించి యసత్యమాడి కులమంతయు నపవిత్రము జేసెద రని మనమున గుందుచుంటిని.

తే॥ గీ॥ అన్నులి మాడుటకుఁ బెట్టు వే ♦ రఘుము లేదు
స్వాంతమందు నిజంబె యుం ♦ చంగవలయు
సత్యమను మీరు విడనాడ ♦ జగతిజనులు
నవ్వరే చుల్కఁజేయరే ♦ నాథ మిమ్ము॥

నాథా! మిమ్మేమైన నే వరములఁ గోరియుంటినా? తమంతట తామే యొసఁగెద మంటిరి. పిదప వగలబొగిలిన నేమి లాభము?

దశ— ఆహా కైకా! యెంత అవివేకపుదానవే! లోకోద్ధారకుండగు శ్రీరాముని వనముల కనుపుమని పట్టుబట్టితివి. హా! రామా! జితభార్గవరామా! నిన్నె ట్లరణ్యమునకు బొమ్మందునోయీ! నాచిన్నియన్నా! నీవు సింహాసన మధిష్ఠించి రాజ్యము చేయుచుండ కన్నులారఁజూచు ననుకొంటినిరా. తండ్రీ! తుదకీపాపి కైకయగు నీ పిన్నమ్మచే ఘోరాటవులపాలు గావఁబడవచ్చెనా! హా!హా!

తే॥ గీ॥ కొల్వులోపల నాముద్దు ♦ కొడుక నిన్ను
నేల నేలుమటంచును ♦ నేడుపల్కి
మరల నీరేడువర్షముల్ ♦ మమ్మువీడి
యడవుల జరించుమంచు నె ♦ ట్లందు నకట!

హా! దైవమా! యినకులోద్ధారకుని కాంతారాంతరవాసునిగాఁ జేయ

నెంచితివా? హా! తండ్రీ!

గీ॥ వైరము వహించ మీమెంత ♦ వారమయ్యె
బాలు నీకిట్టి కానల ♦ పాలు జేసి
క్రూరు నిటువంటి వానిని ♦ కుమతి నన్ను
నేల బ్రతికించి తీవు స ♦ ర్వేశ భువిని॥

ఉ॥ చంపుము దైవమా యిపుడు ♦ సత్వర నన్నిక జాలిబూనకే
పెంపువహించు సూర్యకుల ♦ వీరుని కానలకంపఁ బూని నా
కొంపను ముంచె కైక, యిట ♦ కోమలగాత్రుని రామమూర్తినిన్
బంపి యికేల ప్రాణముల ♦ పై భ్రమ? యింట మెలంగు టెట్టులో?

హా! తండ్రీ! రామా!

గీ॥ నన్ను విడనాడి పోదువా ♦ నన్ను తాంగ
నిన్ను గన్గొని కైకేయి ♦ నీతిదప్పి
యుగ్గిపడికొనె కనులలో ♦ హద్దుమీరి
నన్నుగావర వేవేగ ♦ జన్ని తండ్రి॥

హా! కౌసల్యాగర్భవారాశిసోమా! రామా! (అనిమూర్ఛిల్లును.)

(తెరజారును.)

(రాముడు ప్రవేశము)

రాము—(తనలో) నా పినతల్లి కైకమ్మ నా తండ్రియగు దశరథేశ్వరుని రెండువరములు కోరెనట. అందు మొదటిది భరతుని రాజ్యాభిషిక్తుని జేయుటయు, రెండవది నారచీరలు ధరించి నేను పదునాల్గు వత్సరములు కానలఁ గాలము గడుపుటయు. నాజనకుడు సత్యవాక్యధురంధరుఁడగుటచే అందులకు సమ్మతించి యాయమకోర్కె దీర్చెనట. ఇప్పుడు నేను జనకు నాజ్ఞవహించి పదునాల్గువత్సరము లరణ్యమందు వసింప నేగవలయు గాన నా జననిని దర్శించి నాయమ్మ యనుమతి వడసి మౌనివేషము ధరించి పోయెద. ఈ కర్ణకఠోరమగు వార్త విని మాయమ్మ కౌసల్యాదేవి యెంత విలపించునోగదా. అయినను జెప్పక తప్పదు. కావున నేనిక పోయి సెలవు గోరెద. (రాముడు నిష్క్రమించును.)

---

తృతీయరంగము - కౌసల్యామందిరము.

(మునివేషమున రాముడు పునఃప్రవేశము)

రాము—అమ్మా! నమస్కారము.

కౌస—తనయా! పట్టాభిషేకమస్తు. (చూచి) ఏల వికారవేషము ధరించితివి తండ్రీ?
రాము—ఇంకను మాయమ్మకు దెలియదుకాబోలు. ఈజాడ లెరింగించిన శోక
మును మితిలేక యనుభవించును. అయినను చెప్పక తప్పదు. చెప్పెదగాక
అమ్మా! నేను, (11 అనుబంధము)

చ॥ జనకుని సత్యవాక్యమును ♦ క్ష్మాస్థలినిల్పగ నాత్మనెంచి కా
ననముల కేగఁగా దలఁచి ♦ నాడ నమస్కృతి సల్పువాడ నో
జననీ! శుభోన్నతుల్ గనగ ♦ జాలిన దీవన లెల్లనిచ్చి న
న్ననునయ మొప్ప బంపుమిర ♦ యమ్మన కైకవరమ్ము దీర్పగన్॥

అమ్మా! పిన్నమ్మగారికి మా జనకుడు తొల్లి రెండువరము లిచ్చియుండె
నట. అందు మొదటిది భరతునకు బట్టముగట్టుమనియు, రెండవది నార
చీరెలు ధరియించి నన్ను కానల కనుపుమనియు కోరెనట. అందుకు తండ్రిగారు
చింతాక్రాంతమనస్కులై గుందుచుండిరి. జనకుని సత్యవాక్యము నిలుపుచు
పిన్నమ్మగారి మనోరథము దీర్పఁదలచి కానల కేగెదగాన సెలవొసంగుము తల్లీ!
కౌస—హా దైవమా! నానోముఫల మీరీతిగా ఫలింపచేసితివా! నేను జిరకాలము
గొడ్రాలుగానుండి కన్నుల కఱవుదీర నొక్కపుత్రుని గన నోర్వలేక
పోతివా? హా! తండ్రీ! సుగుణాభిరామ! (12 అనుబంధము.)

మత్తకోకిల

కౌస — ఏలరాజ్యము లేలసంపద ♦ లేల తేరు లికేలరా
బాలచంద్రునిబోలు నిన్నెడ ♦ బాసినంతనె పుత్రికా॥
రాము— కాలకర్మముచే లభించెడు ♦ కష్టకాలము దప్పనే
బేలరీతిగ నేడ్చెదేలను ♦ బెంగమానుమి తల్లిరో॥
కౌస — కన్నకర్రి పురంబువీడియు ♦ కాననంబున కేగగాఁ
దిన్నగా మదినెట్టు నిల్పుదు ♦ ధీనిధీ తగఁదెల్పుమా॥
రాము— ఎన్నగా బితృవాక్యపాలన ♦ నెంచనట్టి కుమారకుం
డున్ననున్ మరిలేక యుండిన ♦ నొక్కటేకద తల్లిరో॥

(అంతట లక్ష్మణుడు కోపముతో ప్రవేశము.)

లక్ష్మ—ఆ యేమీ! యెంతదూరము తిరిగినను మాయన్నగారు కన్పింపరు!
కానల కేగియుండిరో (ఇటుచూచి) హా! రామా! నీలమేఘశ్యామా! నిన్ను
దర్శించుభాగ్యము ఈ మందభాగ్యునకు లభించునా? ఓసీ! ద్రోహీ! కైకా!
నీసుతునకు బట్టముఁ గట్టవలెనా? (13 అనుబంధము)

చ॥ వరపరదెంతు నీసుతుని ♦ బాహుబలంబున, నిన్ను జంపెదన్
గరకరి నా యొనర్పుప్రతి ♦ న న్విని యుద్ధమువచ్చు వారినే

మనయుక గాలబా్రిమెదను ♦ మాయలమారి యికెందు జొచ్చెదా
ఎరబరికంపు కోరికెల ♦ నేఁ గడతేర్చక యుంకువాఁడనే?

రాము—అన్నా లక్ష్మణా! నీవిట్లు భీకరాకృతినిబూన కారణమేమొ చెపుమా?

గీ॥ కైక నివ్వడుబట్టి యీ ♦ ఖడ్గమునకు
నర్పణముజేసి కసిదీర్తు ♦ నవసరముగ
దోసకార్యమ్ము కొడిగట్టె ♦ మోసకారి
యెంతకైన హంతకులు స్త్రీ ♦ లినకులేశ॥

అన్నయ్యా! కైక యిట్టి కృత్రిమవరములు గోరవచ్చునా? యిట్టి పాపిని ఖండించినను పాపమనరాదు. అన్నయ్యా! సెలవొసంగుము. కైకను ఖండించి వచ్చెదను.

రాము—అనుజా లక్ష్మణా! ఏల యిట్లు బలికెదవు?

(14 అనుబంధము)

ఉ॥ భూతము నీకు సోకినదొ ♦ పూర్తిగ పైత్యము నెత్తికెక్కెనో
పాతకమంచునాక మధు ♦ పానముచే మదిదప్పియుంటివో
మాతనుగూర్చి యిట్టులభి ♦ మానము వీడుచు దూలనాడెదా
లాతియె యిట్లు పల్కుటకు ♦ లక్ష్మణ! యిప్పనిజేయఁ బాడియే!

లక్ష్మణా! భరతుడు నాయెడ నధికభక్తుడు. అట్టివాని నిందించుట నీకు తగవుగాదు. ఇంక శాంతమూనుము.

(అంత దశరథ, సుమిత్ర, కైక, సీతలు ప్రవేశము.)

రాము—తమ్ముడా! మన జననీజనకులిటే వచ్చుచుండిరి. నమస్కరింతము రమ్ము.

లక్ష్మ— చిత్తము.

దశ—కుమారులారా!

తే॥ గీ॥ వనములందుండు డంచు న ♦ వ్వనజభవుడు
ఫాలతలమున లిఖియించె ♦ పాపి మీకు

రాము— ధాత నిట్టుల దూషింపఁ ♦ దగునె తండ్రి!
పూర్వమందు నేజేసిన ♦ పుణ్యమిదియె॥

సుమి—హా! తనయులారా! పదునాలుగు వత్సరములు మీరు ఘోరాటవుల దిమ్మరుచుండ మే మేరీతిగా నీ యయోధ్యయందు సుఖ మనుభవించువారము. మిమ్ము బాసినపిదప మాకీసౌఖ్యభాజనమేల తండ్రులారా!

రాము—అమ్మా! సుమిత్రా!

తే॥ గీ॥ పదియునాల్గు వత్సరము లే ♦ పగిదిఁజూడ
పదియునాలుగు దినము లౌ ♦ పడతిమాట
సుమి— తండ్రి యీలాగు బల్కుట ♦ తగదు తగదు
వర్షములు రోజులెట్లగు ♦ వనరుహాక్ష!

తండ్రీ! నీపితృభక్తియే నిన్నుగాపాడు. పోయిరమ్ము.

రాము—అమ్మా! కౌసల్యా! సెలవొసగుము.

కౌస—మంచిది తండ్రీ! పోయిరమ్ము. నీసత్యమే నిన్నుఁగాచుగాక!

రాము—(కైకనుజూచి) తల్లీ కైకమ్మా సెలవొసగుము.

కైక—శీఘ్రమే పోయిరమ్ము. సత్యము నిలుపవలెనుగదా?

రాము—సోదరా లక్ష్మణా! నిన్నెడబాయవలసి వచ్చినది. నిలువుము. శాంతముతో నుండుము. నేనింక పోయివచ్చెద.

లక్ష్మ—ఏమీ! నిన్నెడబాయుటా! యిచట నిలుచుటా! శాంతమున నుండుటా! ఎంత చిత్రము, అన్నా! యిన్నిమాటలేల? నేను నీతోడనే వచ్చెదను. నీవు గట్టిగ నెడబాయుమనునెడ నేనీ శరీరమునే యెడబాయుదును.

రాము—(తనలో) ఈతనిరాక కనుమతింపక తీరదు. కానన్న నీ సౌమిత్రి నిజముగ మేను దొరంగగలఁడు. (ప్రకాశముగ) మంచిది సోదరా! నీవును వచ్చెదవా? యింటనుండవా? అయిన రమ్ము. చాల కష్టముసుమా!

లక్ష్మ—అన్నా! తమరే కష్టములకోర్వ నేనోర్వజాలనా? వచ్చెదను.

సీత—(తనలో) నా నాథుడు నన్నువిడిచి కాననభూమికి బోయెదరు గాబోలు! నా నాథుని బ్రార్థించి పదసేవజేయు నీ దాసురాలిని దోడ్కొనిపోవునట్లు సెలవు కోరెదను. (ప్రకాశముగ) నాథా! మీదాసురాలిని సైతము గొని పోవ బ్రార్థించెద. దేవరవా రనుగ్రహింతురుగాక! (15 అనుబంధము)

రామ—దేవి! (16 అనుబంధము)

సీ॥ కఠినకంటకమయ ♦ కాననంబులెగాని
జనులుండు పట్టణ ♦ సమితిగాదు
శరభ శార్దూల ని ♦ ర్భర నాదములెగాని
పరువగు శుకపిక ♦ ధ్వనులుగావు
కందమూలాదుల ♦ గాల్చి తినుటెగాని
షడ్రసోపేతాన్న ♦ సరణిగాదు
చీకాకుగానుండు ♦ చెట్టుచేమలెగాని
వర్ణింప గేళికా ♦ వనముగాదు

తే॥ గీ॥ పడఁతి నీవేడ యడవుల ♦ నడుచు టేడ
బడలెదవుచుమ్మి యచ్చట ♦ నడుగులిడఁగ
మగుడివచ్చెద గడువు వే ♦ మరలి చనగ
భామ! నీవిది గగ్గోలు పడక నిలుము॥

మరియు నో భూజంతా! జలజమిత్రుని ఘాకలతను, సలిలధారల చలికిని నోర్చి చరించవలయు గాన నీ విచ్చటనే దాసదాసీజనంబులతో నుండుము.

సీత—నాథా!

సీ॥ న్యాయమా యిది సాంపత్రి ♦ దాయమా సతిబాయ
శ్రేయమా నీకిది ♦ శ్రీనివాస
నేరమా యిటుజూడ ♦ భారమా నాయెడ
వైరమా నీకు నో ♦ వనజనయన
చందమా కనుల కా ♦ నందమా యిది జనా
నందమా నింద నా ♦ కుం దనర్ప
కోపమా నాపైయు ♦ పాపమా కృపజూపు
నాపయి, నన్ను మీ ♦ దాపు జేర్చి
తే॥ గీ॥ ధైర్యము నువీడ నివ్వాడు ♦ గార్యమౌన
జాలమేలన? వేగభూ ♦ జాతకిపుడు
హర్షమున వెంటవచ్చున ♦ ట్లానతిమ్ము
రామ! రఘురామ! పట్టాభి ♦ రామనామ!

రాము—దేవి! యేమి యిట్లుకోరెదవు? ఇంతసాహసము చెల్లునా?

సీత— ద్వి॥ ఓరాజరాజేంద్ర ♦ యోరామచంద్ర!
ఈరామ నిటువీడు ♦ టెట్టిన్యాయమ్ము?

రాము— జానకీ! యిటులాడ ♦ సరసమే భువిని,
కానను దిరుగాడఁ ♦ గారాదు స్త్రీలు.

సీత— అగ్నిసాక్షిగను న ♦ న్నమరుల యెదుట
లగ్నంబునందు ఫా ♦ లాక్షునివిల్లు
విరచియు బెండ్లాడి ♦ వేడ్క నయోధ్య
పురి జేర్చి యిటవీడి ♦ పోవంగదగునె?

రాము— నీ నుడి సత్యమే ♦ నిన్ను నే వనికి,
మానిని! కొనిపోవ ♦ మనసొప్పకుండె.

సీత— నిమువీడి భూజాత ♦ మితిలేనిచింతతో
గామనైనతనువును ♦ గోల్పోక, మును నే.

కౌస— హా! సీత యిటులాడ ♦ గా నోర్వగలమె?
మాసన్నిధినినుండు ♦ మాప్రాణధనమ!
(రామునిజూచి) హా రామ! హా రామ! ♦ అయోధ్యరామ!
కారడవులకేరు ♦ కదలిపోయెద రి!
లక్ష్మ— అమ్మరో సెలవు దూ ♦ కతివేడ్కనొసంగు
సమ్మతిబోదుకు ♦ సత్కృపజూడు.
దశ— నేను పాపుడ తండ్రి! ♦ నీయెడజాల
మానుగ కైకతో ♦ మంతినమాడి
నిన్నుగోల్పోయితి ♦ నిమిషంబులోన
దిన్నగా వనికేగి ♦ తిరిగిరమ్మిటకు.
సుమిత్ర— రామ! లక్ష్మణ! సీత! ♦ రయమున దిరిగి
క్షేమమ్ముగారండు ♦ క్షితినేలుకొండు.
రాము— చిత్తము మాయమ్మ ♦ శీఘ్రమే తిరిగి
వత్తుము నీదయ ♦ వలన నియ్యోడకు.
దశ— చెచ్చెర మీర లీ ♦ సీతతోగూడి
యిచ్చటికే రండి ♦ హితమతి దండ్రి!
కైక—నాథా! యీరద్దియేల? యింత వగచుచు మీరిచ్చువరములు మాకేల?

తే॥ గీ॥ వరము లీయంగ లేదని ♦ పల్కచాలు
చాలు నంతియె సత్యంబు ♦ సాగిపోను
బ్రతికియుండిన బలుసాకు ♦ బడసితినుచు
భరతుమను నేను వనికేగి ♦ బ్రతుకలేమె?

దశ—కైకా! యింతపని జేసితివి. ఇంకను నీకోర్కె దీరలేదా?

(రాగమాల)

సీ॥ శ్రీరాగమున జిక్కి ♦ చింతసేయక కైక
కోరినవరములు ♦ గొనుమటంటి
మోహనాకార నీ ♦ ముద్దుమోమునుజూచు
భాగ్యహీనుండనై ♦ బ్రతుకనుంటి
భూపాల పుత్రుల ♦ పుడమినేలక వన
భూమినేలుమటంచు ♦ పోవుడంటి
తోడివారలకంటె ♦ దొరవలైనుండు ని
స్సరయుగన్నులులేక ♦ నడలుచుంటి

తే॥ గీ॥ భూరికళ్యాణుఁడంచని ♦ పురజనములు
సంతసించిరి యెంతలో ♦ వంతగంటి
భైరవీపతికృపచేత ♦ వరమపురుష
సుఖము చేకూరుమీాదటఁ ♦ జూమమంటి॥

రాము—తండ్రీ!

ఉ॥ అమ్మనదూరకయ్యి యిది ♦ యంతయు నావిధికర్మమయ్యె జూ
(తల్లులతో) సమ్మతిమాకుదల్లులరు ♦ చాలిన సాధ్వులు లేరుగాన చి
న్నమ్మను దూరకండి మది ♦ వ్యాజముబూనక యుండు డమ్మరో!
యిమ్మగ దమ్ముడే ధరణి ♦ నేలగజాలెడు పార్థిజ్ఞలౌనవర్ణ॥

తలిదండ్రులారా! చిన్నమ్మయగు కైకమ్మగారిని మిగుల గౌరవముగా జూచుచుండుడు! ఆమెపై గాసంతయైన నీసు జూపకుడు. అమ్మా! కేకయ రాజపుత్రీ! భవదిచ్ఛానుసారముగా సెలవొసంగుము.

కైక—కుమారులారా! నావరములు చెల్లించుటచే నాచంద్రార్కము ఖ్యాతిజెందు దురుగాక!

రాము—చిత్తము. పోయెదము జననీ!—దేవీ! లక్ష్మణా! పోదమురండు.

కైక— గీ॥ కట్టలక్ష్మణ! కైకేయి ♦ కూళయనుచు
కినుక బూనకు సుఖము మీా ♦ కును ఘటించు
(సీతపైచెయివైచి) నేడు మాయత్త కైకేయి ♦ చూడలేక
మమ్ము వనికంపె నంచని ♦ మదిఁ దలఁపకు॥

భూజాతా! సుఖముగా పోయిరమ్మ,

సీత—చిత్తము.

(అని అందరు నిష్క్రమింతురు.)

ద్వితీయాంకము సంపూర్ణము.





శ్రీ

# సంపూర్ణ రామాయణము



## తృతీయాంకము

### ప్రథమరంగము - కైక అంతఃపురము.

(భరత, శత్రుఘ్న, వసిష్ఠుల ప్రవేశము)

భర — ఏమీ? పట్టణరాజమంతయు శోభ దరిగి వెల్వెలబారియున్నది. రాజమార్గము లన్నియు భీతిదాయకంబున కాలవాలమై యొప్పుచున్నవి. నగరియం దెచ్చట జూచినను మంగళతూర్యధ్వనుల సవ్వడిలేక కాళరాత్రివలె నిశ్శబ్దముగ నున్నది ఏమికతమై యుండనోపు? మాతల్లినారసి గ్రహించెదగాక!

(కైక ప్రవేశము.)

భర — తల్లీ! పట్టణ మిట్లుండుటకు కారణమేమి చెప్పుమా?

కైక — కారణమా?

చం॥ వరములు రెండు, నీగురుడు ♦ వైభవలీల నొసంగె పూర్వమే
దిరమతి నవ్విగోరుట కి ♦ దేశరి; నిన్నిట పట్టభద్రునిన్
సరసుల రామలక్ష్మణుల ♦ సత్వర కాననసీమలందు సు
స్థిరముగ మన్నువర్షముల ♦ దిమ్మరఁ బంపుడటంచు వేడితిన్॥

ఇట్లు కోరియుంటిని. అందులకు మీతండ్రిగా రంగీకరించి సీతా రామలక్ష్మణుల నరణ్యమునకు బంపిరి. వారుపోయిన సప్తదివసంబులకు మీ తండ్రిగారు దివికేగిరి. ఇప్పు డీపట్టణమేల నేలికలేక యరాజకమై శోభ దరిగియుండె? నా వరద్వయమున నొండుదీరె. ఇంక రెండవది నిన్ను రాజ్యాభిషిక్తుని జేయుటకు మిగిలియుండె. రాజ్య మిట్లరాజకంబుగా నుండ రాదు? గావున నీవు సత్వరము రాజ్యరమను గ్రహింపుము.

భర—ఓసీ! చండాలీ!

(17 అనుబంధము.)

ఉ॥ నాలుక వ్రయ్యలెప్పుడగు ♦ నాథుని జంపితి, వన్నదమ్ములన్
బాలను సీతనన్ వనికి ♦ బంపితివిచ్చట నెట్లు నిల్చితో
తాలిమి రామలక్ష్మణుల ♦ తాపసరూపెటుజూచితీవు? మా
పాలిటి మృత్యుదేవతగ ♦ వచ్చితి వక్కట మోటు రక్కసీ!

తే॥ గీ॥ సిగ్గులేక యీరాజ్యంబు ♦ సేయుమనుచు
చెప్పచుండిన నినుజూడ ♦ చేటుగల్గు
మొండిరక్కసి! గదచేత ♦ మొత్తి నిన్ను
విందు జేయుదు జూడుము ♦ విహగతతికి॥

అయ్యో దైవమా! పరమపాతకికరుగు నీ కైకకడుపున జన్మించుట నాపూరాకృత కర్మమేకదా? ఓసీ! ఘాతుకీ! యింతకార్యంబుజేసి యిందరి యెదుట నెట్లుదలయెత్త సాహసించితివి?

చ॥ బుధులగు రామలక్ష్మణుల ♦ భూసుర పూజ్యుల, వీడి నేనెటుల్
పదపడి యియ్యయోధ్యపురి ♦ పాలన జేయుఁగలాడ? మీఁదిదా
కథగనలేక ఘోరతర ♦ కార్యము జేసినదాన వైతివే
మదమున కన్నుమిన్నగక ♦ మన్మనుబెట్టితి వోసి రక్కసీ॥

ఓసీ! నీవు నాపాలిటి పెనుభూతమవుగాని తల్లివిగావు. నీతనువు నీ కరవాలముచే ఖండించెద జూడుము. (నరకఁబోవును.)

శత్రు—(అడ్డమువచ్చి)

(18 అనుబంధము.)

తే॥ గీ॥ శాంతమువహించు మోయన్న ♦ శౌర్యమూని
అమ్మ నిటుజంపు టన్యాయ ♦ మార్యవినుత!
మాతృవధ దోషములభించు ♦ మనకు గాన
నిట్టి క్రూరకార్యము సేయు ♦ టేల? వలదు.

అన్నయ్యా! నామనవి నాలకింపుడి! ఇక్కార్యమునకు సాహసించిన రామచంద్రుఁడు మాతృహంతకులమగు మనలజూడ నిచ్చగింపడు.

కైక—నాయనా భరతా! నీకుగాను—

మ॥ పసుపుం గుంకుమ బాడుచేసికొని నే ♦ పాపంబు నార్జించితిన్
వసతుల్ శూన్యముగాగ నేనిపు డవా ♦ ర్యంబైన నిందన్ భువిన్

బసమీరంగ వహించితిప్పగిది, నా ♦ ప్రారబ్ధమిట్లయ్యెఁగా
గసవున్ మేయఁగఁబోయి బుద్ధిచెమి, దుః ♦ ఖంబొంద నేమయ్యెడున్ ॥

అయ్యో! మంథరదుర్బోధలచే నాకెట్టిసంకటములు కలిగినవి! వీని మ్రోల నిలిచితినేని నన్ను బ్రతుకనీయఁడు. నే వేగమ చని కౌసల్యాదేవి పాదములపైబడి నన్ను క్షమింప వేఁడుకొనియెద.

గీ॥ పరుల సౌఖ్యంబులను జూచి ♦ పాపమతులు
గీడు సేయంగ జూతురు ♦ గూఢముగను,
దాన నాశమ్ముగల్గు; త ♦ ధ్యమ్ము, గౌర
వమ్ము, కీర్తి, సుఖమ్ము పూ ♦ జ్యమ్ము సుమ్ము॥

నే నిప్పుడేపోయి కౌసల్య నాశ్రయించెద. (నిష్క్రమించును.)

భర—మాయన్న కానల కేఁగుకాలమున నన్నెంతదూరెనో కదా! నే నెట్టు లాతని గాంతు? క్రోధస్వామియగు లక్ష్మణస్వామి నాపై నెట్టి యాగ్రహము జూపుచుండెనో? ఎట్లయినను నరణ్యములకుం జని సీతారామ లక్ష్మణుల ప్రార్థించి మరల పురప్రవేశము గావించెద. తమ్ముఁడా! సుమంత్రామాత్యాది పౌరుల కొందర నాయత్తపరచుము. నేనుకౌసల్యాదేవి కడకేగి ఆయమ సెలవొంది వచ్చెద. అయ్యోదైవమా! కౌసల్యాదేవి నన్ను జూచినతోడనే, పట్టభద్రుఁడా వచ్చితివాయన, శిరము నేల వైచుకొనవల సినదే కదా? హావిధీ! పురజనులెల్లరు నన్నెంత దూరుచుండిరో కదా? యెవరెట్లనుకొనిన నేమి? సర్వాంతర్యామియగు శ్రీరాములకే సర్వము దెలి యును. సోదరా! సుమంత్రాదిమంత్రులను నింక కొందరపురజనులను ముందు నడిపింపుము.

శత్రు—చిత్తము. (నిష్క్రమించును.)

---

ద్వితీయ రంగము—చిత్రకూటప్రాంతారణ్యభూమి.

(సీతా రామ లక్ష్మణులు నారచీరలతో ప్రవేశము.)

(19 అనుబంధము.)

రాము—తమ్ముఁడా! లక్ష్మణా! యీభూజాత కడుదవ్వు నడుచుటచే నొడలుఁబడలి తనువు తెలియక నిదురించుచున్నది. చూడు! కనుక నే నిద్రసుఖమెరుంగదని నుడివెదరు.

సీ॥ అంతఃపురంబుల ♦ నలరెడు సీతన్వి
కాంతారభూముల ♦ గ్రిందవలసె
కనకాంబరంబులు ♦ కట్టెడుపూబోడి
వల్కలములధరిం ♦ పంగవలసె
హంసతూలికపాన్పు ♦ నందు బండెడుసాధ్వి
కఱకునేలను నిద్రి ♦ గాంచవలసె
పంచభక్ష్యాన్నముల్ ♦ భక్షించుభామిని
కందమూలములతో ♦ గుందవలసె

తే॥ గీ॥ నరుణకాంతి యెఱుంగని ♦ యతివమిన్న
మండుగాడుపు టెండలో ♦ నుండవలసె
చెలుల గానంబులకు నంత ♦ సిలెడుచాన
ఝల్లికాధ్వనులకు నుల్ల ♦ సిల్లవలసె॥

లక్ష్మణా! పాపమింకను మేల్కాంచియుండలేదు. నడచుటవలని శ్రమ చేత నేకదా? (పైనజూచి)

సీ॥ పూర్ణేందువదన సీ ♦ భూపుత్రిగావరే
జగముబ్రోచెడు సూర్య ♦ చంద్రులార
జనకరాట్పుత్రి సీ ♦ సాధ్విని బ్రోవరే
యతికృపారసముంచి ♦ యమునలార
దశరథుకోడ లీ ♦ తన్విబోషింపరే
వనవాసులౌ మాని ♦ వర్యులార
రాముని దేవేరి ♦ రక్షింపగాలేరె
శీలంబుగల్గు ది ♦ క్పాలులార

తే॥ గీ॥ నగములార! సుఖారవ ♦ ఖగములార
భిల్లదారలార! లతికామ ♦ తల్లులార!
యడవిజనులార! యోరాజ ♦ హంసలార!
కావరే సీత నిటమీద ♦ కనికరమున॥

లక్ష్మ—అన్నయ్యా! సర్వసుఖము లనుభవించు ఈజనకజ మిగుల సుకుమారి యగుటచే కష్టములకోర్వజాలక యిట్లు బేలయయ్యె. (ఆకసమువంకజూచి) అన్నయ్యా! అటు జూడుడు.

(సీత లేచి కూర్చుండును.)

గీ॥ ధూళి దశదిశలను నిండె ♦ దోహదముగ
వినగనయ్యెడు కలకలా ♦ వేశరవము

శత్రులెవ్వరో బాణాగ్ని ♦ జావ, గ్రొవ్వి
వచ్చుచున్నట్లు దోఁచె నీ వనమునకును॥

(మరల పైకిజూచి) అన్నయ్యా! నిక్కముగా నిట్లే జరుగునని నిశ్చయించితిని.

సీత—మఱదీ! లక్ష్మణా!

గీ॥ తిండియును నిద్రియును లేక ♦ యుండుటను
నిల్లు విపరీతముగదోఁచు ♦ నేమొకాని
నీవు వచియించినదిచూడ ♦ నిక్కమనుచు
బుద్ధి దలపోయుజాలనో ♦ మఱదుమఱది!

లక్ష్మ—అమ్మా జానకీ! మీరిట్లు సెలవీయవలదు. నిక్కముగా శత్రువు లెవ్వరో వచ్చుచున్నారు (అని నలుదెసలుజూచి) తెలిసినది. తెలిసినది. అన్నయ్యా! యేమి యీకాలమహిమ! (20 అనుబంధము.)

ఉ॥ సన్నగ మింట నుత్తరపు ♦ వైపున నెట్టనిధూళిగప్పి జూ
క్రిన్నన కైకజుండు, రణ ♦ రంగమునన్ మనలం జయింప న
త్యున్నత సైన్యసంఘములు ♦ నొయ్యన తోడ్కొనివచ్చుచుండె నో
యన్న! యనుజ్ఞ నిమ్మతని ♦ నాహవభూమిని దున్మితు జయ్యనన్॥

అన్నయ్యా! వానికేమియపచార మొనరించియుంటిమి? రాజ్యరమను నేకచ్ఛత్రాధిపత్యముగా నేలుకొమ్మనినను వానికి దనివిసనక మనల జంపనెంచి వచ్చుచుండెను. కానల బ్రతుకుచున్నను నీ దుష్టాత్ముండగు భరతుండు మనల బ్రతుకనిచ్చునట్లు లేదు. దేవా! వాఁడు రాజ్యమేలుసమయమున మనమున్నయెడల మనలచే నెట్టి హీనకార్యముల చేయించుట కుపక్రమించునోకదా? అన్నయ్యా! భరతుఁడు నీచస్వభావులతో ముచ్చటించుటకైన నిచ్చగొనడని పలుమారు బలికియుంటిరే? ఇప్పటికి వానిచరిత్రమంతయుం దెల్లమయ్యెనా? అయిన నిప్పుడు మిగిలినదిలేదు.

రామ—తమ్ముడా! కోపోద్దీపితమానసుండవగుటచే, గుడ్డివానికిజగం బంధకారబంధురంబైనట్లు, భరతుని నిర్మలమనఃపద్మము గుర్తెరుగక విపరీతముగా బల్కుచుంటివి. ఎన్నిసారులు వలదన్నను క్రోధమును బెంచుచుంటివిగాని తగ్గించుట లేదు. లక్ష్మణా! యిదియే కడసారిమాట! యిటువినుము.

చ॥ భరతుని, ధర్మవర్తనుని ♦ భవ్యచరిత్రుని భక్తియుక్తునిన్
బరుసములాడుచుంటి విది ♦ భావ్యమె పాపముకాదె లక్ష్మణా!
ధరణిని నాకొసంగుటకు ♦ దానిట వచ్చుచునుండె బ్రార్థనల్
బరువడిసేయుచున్ హృదయ ♦ పద్మమునన్ ననునిల్పి భక్తితోన్॥

లక్ష్మణా! శాంతివహింపుము. మరియు నేటిప్రభాతమున గనినస్వప్న మందు మనభవనమంతయు భస్మమైనట్లును, పరివారమెల్ల నమసిపోయి నట్లును నమంగళములఁ గంటిని. ఇందలి చెడుగులు వెంటనే ఫలించునని తోచుచున్నది. (అని దీనతజూపును.)

సీత—నాథా! ధైర్యమూనుడు. పరమేశ్వరు డీయమంగళముల నమ్ముజేయుగాక!

లక్ష్మ—ఈస్వప్నఫలములు పుత్రశోకమున మునింగిన తండ్రిగారిపై బారవుకదా! భరతుఁ డిటే వచ్చుచున్నవాఁడు. అన్నయ్యా! భరతుడు వచ్చులోగా ప్రాతఃకాలకృత్యంబులఁ దీర్చుకొనుటకు నదీతీరమునకుం బొందు.

రాము—అట్లనే చేసెద. నేడేలకో నామానస మమితశోకమును బొందుచున్నది. కారణ మేమైయుండును?

(నిష్క్రమింతురు.)

---

తృతీయరంగము - అరణ్యము.

(కైక, కౌసల్య, సుమిత్ర, భరత, శత్రుఘ్నులు, కొందరుపౌరులు ప్రవేశము.)

భర—అమ్మా కౌసల్యా!

సీ॥ అపరంజిగద్దెపై ♦ నధివసించెడువాడు
దర్భాసనంబున ♦ దనరుచుండె
పీతాంబరములచేఁ ♦ బెంపుగాల్పెడివాడు
వల్కలధారియై ♦ వరలుచుండె
సమహంసతూలికా ♦ శయ్య నుండెడివాడు
కఠినంపు నేలపైఁ ♦ గ్రాలుచుండె
నమృతాన్న రసముల ♦ నారగించెడివాడు
కందమూలములతోఁ ♦ గడుపుచుండె
తే॥ గీ॥ నడవులందున దిరుగాడ ♦ నరిగె బదము
లట్టి సుఖభోగి నిటుజేసె ♦ కట్టడివిధి
యొండసోకున కసుగంది ♦ యుండెమోము
కాలవిపరీతమున గష్ట ♦ కాలమబ్బె॥

ఆహా! దైవమా! నన్నెంత పాపినిగాఁ జేసితివి. నా సోదరుని యిడుముల జూచుచు జీవించవలసివచ్చెఁగదా!

(లక్ష్మణుడు ప్రవేశము.)

లక్ష్మ—(భరతుని కౌఁగిలించుకొని)

తే॥ గీ॥ నీ స్వభావము గనలేక ♦ నేను మిగుల
దిట్టితిని జంపఁబూనితి ♦ చెట్టనగుచు
నీసువృత్తముఁ గనుగొంటి ♦ నింక మీద
నాయొనర్చిన తప్పాలె ♦ న్నకుము భరత॥

సోదరా! ఆగ్రహాగ్రహ మావరించి మేనుమఱచి నీయందపచారము సేంచిన యీమూర్ఖుని క్షమింపవలయు.

భర—అగ్రజా! లోకోద్ధారకులగు మిమ్ము నిట్టి కష్టముల గల్పించిన నన్ను మీ శరధారలచే దుృంపక నన్నే క్షమింపుమని పల్కుచుంటిరా! (అని పదములపై బడును).

(రాముడు, సీత ప్రవేశము.)

భర—అన్నా! నమస్కారము.

(21 అనుబంధము)

గీ॥ లేశమైన దుర్దోషంబు ♦ లేదు లేదు
నీపదాబ్జముల్ నమ్మితి ♦ నిక్కముగను
దానుఁ డాగిఁ జేయు తప్పులు ♦ దండమిడఁగ
దీగునను సామెతను మీరు ♦ స్థిరపరుపగ॥

దేవా! మాతల్లి యొనరించిన కార్య మేనెరుంగ నైతి. నేనెరిగి యున్న తనుశిక్షకు పాత్రుఁడ.

రాము—సోదరా! నీయందణుమాత్రమైన దోషములేదని నేనెరుంగుదును. నీవంతగా జింతింపబని లేదు. ఇపు డీఘోరాటవుల కేలవచ్చితిరి? మన జననులేల సర్వాభరణవర్జితలై కన్పట్టుచున్నారు? తండ్రిగారికి కుశలమే కదా?

భర—(తనలో) అయ్యో! యేమి చెప్పుదును! (ప్రకాశ) అన్నయ్యా! పుత్రవియోగ దుఃఖభరముచే నాయనగారు దివి కేగిరి.

రామ—హా! తండ్రీ! (మూర్ఛవడి కొంతసేపటికి లేచి)

గీ॥ పుత్రశోకభరమ్మున ♦ బుడమివీడి
స్వర్గమున కేగితో కొక్కో ♦ జనక వేగ
నీవుమరణించుటాలించి ♦ జీవములను
ముండినై వేగ వీడలే ♦ కుండితకట॥

లక్ష్మ—అయ్యో తండ్రీ! పాపాత్ములగు మమ్ముఁబాడ శంకించి స్వర్గముఁజేరియుంటిరా? హా! జనకా!

కౌస—నాయనా రామచంద్రా! మీతండ్రిగారు తమకు పూర్వమందు సంభవించిన శాపమును జెప్పుచు హా! తనూభవా! హా! ఇనకులేశా! హా! రామచంద్రా! అనుచు మిగుల శోకముతో బ్రాణముల విడిచిరి.

రాము—హా! తండ్రీ! దశరథేశ! (అని మూర్ఛిల్లును.)

వసి—కుమారా! రామచంద్రా!

చం॥ సలిలములందు బుద్బుదము ♦ చంచలమై నశియించునట్లు భూ
స్థలిగల జంతుసంతతులు ♦ చచ్చుచు బుట్టుచునుండ జూచి వే
తెలియనివానిచందమున ♦ దీనతనొంది కృశించుటొప్పునే
మలినమునొంద నీమనసు ♦ మాన్యులు మెత్తురె చాలు రాఘవా!

రామచంద్రా! ధైర్యమూని ముందు నిర్వర్తించు కార్యముల కుపక్రమించుము.

రాము—చిత్తము.

సీత—అత్తయ్యా!

గీ॥ కానలకు వచ్చునప్పుడు ♦ కనకమయ వి
భూషణాంబరములతోడ ♦ బొలుచుమిమ్ము
గంటి పార్వతివలె; నేడు ♦ కట్టడివిధి
చూపె మిమ్మిట్లు విధవ్రాత ♦ శాపగలమె॥

ఎట్టి బెడిదంపుటిడుములు సంభవించె హా!

కౌస—అమ్మా భూజాతా! యిట్లేల విలపించెదవు? నిక్కముగా బాపాత్ములము మేమే. కాకున్న మీచెంతనుండు భాగ్యము లభింపకుండుటయు, హృదయేశు గోల్పోవుటయునా? ఇట్టి విపత్పరంపరల జిక్కి మిగుల విలపించుచుంటిమి తల్లీ!

వసి—కుమారులారా! యెంతకాలము చింతించినను పితృశోకము చల్లారదు. స్నానమాచరించి పైతృకమున కుపక్రమించుడు.

రాము—

గీ॥ మౌనిచంద్రమ! మీయాజ్ఞ ♦ మౌళిదాల్చి
జనకునకు నేను బురిసెకు ♦ జలము విడుతు

లక్ష్మ— తండ్రి నిన్నిపు డేరీతి ♦ ధన్యుఁజేతు
రగిలె శోకాగ్ని నామది ♦ రామచంద్ర॥

అయ్యో గురువరా! తండ్రిగారి మనోరథ మేరీతిగా దీర్పగలను?

భర—అగ్రజా! నాయందుగల దోషములు క్షమించి తమరాక కెదురుచూచు చున్న రాజ్యరమను స్వీకరింపవలయునని యీ దీనుని ప్రార్థన.

కైక—తండ్రీ రామచంద్రా! యీ దురాత్మురాలి దోషముల క్షమించి రాజ్య రమను గ్రహించి మాయుప్పు దప్పింపుము.

రాము—అమ్మా! తామిట్లు సెలవీయతగదు. మా జనకుని మానవ మేవిధమున దృప్తి నొందించగలను? చంద్రుని కొక్క నూలుపోగన్నట్లు వారి యాజ్ఞ నెర వేర్చెద.

భర—అన్నయ్యా! నేనును మీ సేవజేయ వనము౹ నుండెద.

వసి—కుమారా! అట్టికార్యమునకు సాహసింపకుము. నీకొక్క రహస్యము జెప్పెద వినుము.

గీ॥ రక్కసుల రూపుమాప శ్రీ ♦ రాముఁడిపుడు
వనములందున బదునాల్గు ♦ వత్సరంబు
లుండవలెగాని నీవటు ♦ లుండరాదు
రాము పాదుకలను గొని ♦ రాజ్యమేలు॥

నీ వధికభక్తుండవు. కాన శ్రీరామ పాదుకలంగొని సింహాసనంబునందిడి నీవు యువరాజ్యాధికారము వహించి పూజనీయంబుగా రాజ్యంబు సేయుము. ఇందుల కెవ్వరును మారుపల్కరాదు.

రాము—గురునాజ్ఞ కందరము బద్ధులమే కదా! (అని పాదుకలిచ్చును.)

(భరతుడు పాదుకల శిరముపై నిడికొని)

భర— (22 అనుబంధము.)

ఉ॥ రాముని పాదుకల్ గొలుతు ♦ రాజ్యము సేయుదు మీయనుజ్ఞచే
బ్రేమముతోడ భూప్రజల ♦ బిడ్డలరీతిగ బ్రోచువాడ శ్రీ
రాముని నామసంస్మరణ ♦ రక్తినొనర్చెద నెల్లవేళలన్
గామితముల్ ధరిత్రినిడ ♦ గా నదిగాకిక వేరెయున్నదే!

త్రిలోకారాధ్యులగు నో రామచంద్రా! నీ పదదాసునికి సెలవొసంగ వేడుచుంటి.

రాము—మంచిది, సోదరా! పురప్రవేశము గమ్ము.

భర—గురుజనులారా! పురంబున కరుగుదము. ఇచ్చట జాగుసేయరాదు.

(అంత కౌసల్య, కైక, సుమిత్ర, వసిష్ఠ, సుమంత్ర, భరత, శత్రుఘ్నులు నిష్క్రమింతురు.)

రాము—తమ్ముడా లక్ష్మణా! మనయిన్క పురజనులకు దెల్లమయ్యెగాన మీాదట మనమిచ్చోటనేయున్న పురవాసులు మాటిమాటికి మనల దర్శింపవచ్చి మనవ్రతమునకు భంగముగావింతురు. మన మిక దండకారణ్యము జేరి యొక కుటీరమును నిర్మించుకొని గాపురముందము రమ్ము.

లక్ష్మ—చిత్తము.

రాము—భూజాతా! పోదమురమ్ము.

సీత—చిత్తము. (నిష్క్రమింతురు.) (యవనికజారును.)

---

తురీయరంగము—పర్ణశాల, సీతారామలక్ష్మణుల ప్రవేశము.

రాము—తమ్ముడా లక్ష్మణా! పూజ్యుఁడగు జటాయుదర్శనము లభించినది. దుష్టులగు జంబుకుమారాది రక్కసులఁ బరిమార్చితిమి. ఇక నీయరణ్యమందు రక్కసులున్నట్టు గన్పించదు. మన మీాపర్ణశాలయందు జానకిని బహుజాగ్రత్తగాఁ గాపాడవలయునుసుమా!

లక్ష్మ—చిత్తము.

(అంత శూర్పణఖ ప్రవేశము.)

శూర్ప—(కోపముతో) నాకుమారుని బరిమార్చిన రాజాధముఁ డీయరణ్యంబున గాపురంబుండెనని మునిజనులచే విని యీాయరణ్యమంతయు దిమ్మరితి. కాని వానిజాడ దెలియదయ్యె. ఆదుష్టు డిప్పుడు కనుపించిన తొలిముద్దగఁ గబళించెద. ఓరీ రాజాధమా! యెందుంటివిరా? (అని కేకలువేసి నాల్గుమూలలు జూచి) ఈ ప్రాంతమున మనుష్యులున్నట్టు ఘ్రాణేంద్రియము జెప్పుచున్నది. ఆయధముఁడే యిందు గాపురముండవచ్చు. అటుపోయిచూచెద. (రాముని సమీాపించి) ఆహా! యేమి వీని సౌందర్యాతిశయము! వీనిజూడగనే దుఃఖమును, కోపమును దీరుటయేగాక వీనిపై మోహ మగ్గలమగుచున్నది.

సీ॥ కమలదళంబుల ♦ కాదను కందోయి
గన్గొన గల్గెన ♦ గ్గలపువలపు
చంద్రునిహసియింప ♦ జాలెడు నెమ్మోము
గన్గొన దమిహెచ్చ ♦ గా దొడంగె
లతల సౌరునుమించి ♦ యతిమోదమిడు కేలు
గవ గన మరు కేళి ♦ గవయదోచు
హరిమధ్యమునుగాంచి ♦ పరిహాసించగఁబూను
మధ్యంబుగన్గొన ♦ ఘుమతఁగొలువు

తే॥ గీ॥ కాంతులీనెడు నీదేహ ♦ కాంతిజూడ
నిండ్రి నీలంబులను గెల్చు ♦ నితని సొబగు
మోహ మగ్నలమయ్యె నా ♦ బుద్ధియందు
వీనిగూడి సుఖంచెద ♦ వేయునేల?

(అని దగ్గర జేరి)

సురుచిరాకారా! నీనివాసస్థాన మెయ్యది? నీతలిదండ్రులెవరు? నీ నామ ధేయమేమి? పరిపూర్ణముగా నెరింగించితివేని పదపడి నావృత్తాంతం బెరింగించెద.

రాము—మా దయోధ్యాపురంబు. తత్పురాధీశులైన దశరథేశ్వరుని తనయులము. ఈబిడ నాసతీమణి. మమ్ము సీతారామలక్ష్మణులందురు. ఇదియె మా వృత్తాంతము.

శూర్ప—రాజా! నే నొకరహస్య మెరిఁగింతు విందువా?

రాము—వినఁదగిన రహస్యమైనచో నట్లనే వినియెద.

శూర్ప—నేను,

చ॥ బలిమినిబట్టి దేవతల ♦ బాములఁ బెట్టెడి దైత్యభర్తకున్
జెలియలఁ; బేరు శూర్పణఖ ♦ జెప్పెడిదేమియు లేదు గాని నీ
చెలిమినిగోరి వచ్చితిని ♦ చేరగ రమ్మిక నీవనంబులో
గలిసి సుఖంబుగాంచుదము ♦ గాలము బుచ్చుదు మింక భూవరా!

(అని పట్టుకొన బోవును.)

రాము—ఆ. ఆ. ఛీ. ఛీ. (అని తొలఁగును.)

శూర్ప—రాజా! నన్నుఁ గూడితివేని యెల్లవిధముల నీకు మేలొనఁగూర్ప గలవాడగు ఖరాసురు డిటనే యధిక సేనాసమేతుండైయుండె. నీ విట్లొనర్చితివేని నేడు నీవిత్యమొందు. (అని చేయిపట్టుకొన బోవును.)

రాము—ఛీ! నాదాపు జేరకు (అని తొలగును.)

శూర్ప—ఓయీ!

ఉ॥ రూపమునందు మేల్మిగల ♦ రూపసి నన్నువరింపుమింక నీ
పాపపుజాతి మానిసిని ♦ బాయుము జాగొనరించితేని సం
తాపము గల్గుసుమ్ము త్వరి ♦ తంబుగ నీచెలి, సోదరున్ వడిన్
గోపము బొంచి మ్రింగెదను ♦ గోరికఁ దీర్పగ రమ్ము వేడుకన్!

నీసోదరుని నీయాలిని మటుమాయజేసెద. నిందుకు సమ్మతించుము. పదపడి యేకాంతమున మదనకళాకలాపముల మనము లలరించు సుఖింతము.

రాము:—శూర్పణఖా!

గీ॥ అన్నివిధముల మేలు ల♦క్ష్మన్న, నీవు
కోరినట్టులైన నతఁడు చే♦కొనును విన్ను
మన్మథక్రీడలను దేల్చి ♦ మనుచుఁగాన
నీకుఁదగుజాణ యాతఁడే ♦ నిక్క మబల॥

కావున, నట్టి రూపయౌవనలావణ్యసుగుణములుగల లక్ష్మణుఁ గోరుము.

(అంతశూర్పణఖ లక్ష్మణునిచెంతకుబోయి)

శూర్ప—బావా లక్ష్మణా! వింటివా మీయన్నగారిమాట!

లక్ష్మ—ఓసీరక్కసీ!

ఉ॥ మూఁడు జగంబులం దధిక ♦ పూజ్యుడు రాముఁడటంచు బల్కుటల్
చేడరో నీవెరుఁగవె వి ♦ శేషము నట్ వరియించెదేలనే,
పోడవటంచు నందముల ♦ పోల్పు వటంచునుగాంచి యాతఁడున్
గాఢపు ప్రేమ నిన్ వలచెఁ ♦ గానదిగానక యిట్టుబల్కెడా॥

కావున నో శూర్పణఖా! నిన్ను రాముడు గోరియుండుటచే నాకు వదినవైతివి గావున మాఱుబల్కక రామునికడకుం జనుము.

సీత—(నవ్వును.)

శూర్ప— గీ॥ నన్నుగన్గొని నీవిట్లు ♦ నవ్వ టేల?
సరసమెరుఁగని యట్టి నా ♦ సవతి నీకు
పొగరు కనులకు సెక్కె జు ♦ మ్మగణితముగ
మ్రింగెదను జూడు మోసీత ♦ మిట్టిపడకు॥
(అని సీతపైబడ రాముడు పట్టుకొని తమ్మునిజూచి)

రాము—లక్ష్మణా!

క॥ క్రూరులు దుష్టాత్ములు నగు
వారలతో నవ్వు బలుకు ♦ వల దెప్పుడున్ని
ష్కారణముగ నేరములిడి
యీరామను మ్రింగజూచె ♦ నిటుక్రోధమతిన్॥

ఇట్టిమిట్టిపాటుగల యీరక్కసిని విరూపింజేసి పనుపుము. ఓసీ శూర్పణఖా! మాలక్ష్మణకుమారుని వెంట జనుము. నీకోర్కెదీర్చును.

లక్ష్మ—చిత్తము. కామినీ! రమ్ము!

(నిష్క్రమించి మరల వచ్చును.)

శూర్ప—(ముక్కు చెవులు తెగి రక్తముతో) ఔరౌరా! రక్కసులే మాయల మారులన్న రక్కసులనుమించి రాజులే మాయలమారులైరి. నన్ను నమ్మించి వంచించెనే! కానిమ్ము. వీరి పనిపట్టెద. వీరలజూడ కోపమును మోహమునుగూడ నన్ను పీడించుచున్నవే. అయినను గానిమ్ము. జగజ్జేగీయ ప్రతాపశాలియైన మాయన్నయగు రావణునకుజెప్పి వీరలపని బట్టించెద. ఇంక నాయాటలు వీరలమ్రోల సాగిరావు. జాగుసేయక యిప్పుడే లంకాపురికేగి మాయన్నను దర్శించెద.

(అని రామునిజూచి పండ్లుకొరుకుచు నిష్క్రమించును)

రాము—తమ్ముడా లక్ష్మణా! ఆకసాంగనం జూడుము. మింట నెట్లురుకుచున్నదో! యేమీ దానిమాయ! ఇంక మనం మున్నంతవర కీవనముచాయ నచ్చునా?

సీత—నాథా! ఆ పార్శ్వముజూడుడు. కురంగమొట్లు గంతులిడుచున్నదో. ఆహా యేమి దాని తీవి!

(23 అనుబంధము.)

గీ॥ చంద్రుడు ధరించు నిత్తికి ♦ శంభుచేతి
లేడికిని బుట్టినటువంటి ♦ లేగ యనగ
కనకకాంతిని మించి యీ ♦ కాననమున
చేరవచ్చుచునుండె బల్ ♦ చిత్రగతుల॥

నాథా! యెట్లయిన నా కాబంగారులేడిని బట్టితెచ్చి నాముద్దు చెల్లింపుడు.

రాము—దేవీ! ఇది యెంతపని!

గీ॥ పట్టితెచ్చెద లేడిని ♦ ప్రౌఢమతిని
జూచుచుండుమి ఇకమీద ♦ సుందరాంగి!
పరగ నాజింక చిక్కక ♦ పారువార
చయ్యనం దెత్తు నామృగ ♦ చర్మమైన॥

అచలాత్మజా! నీ వడిగినవస్తువు దెచ్చియిచ్చుట నాకు ప్రీతినకావున యిప్పుడే తెచ్చియిచ్చెద. అనుజా! లక్ష్మణా!

(24 అనుబంధము.)

గీ॥ దేవికోరిన కోర్కెల ♦ దీర్పవ్రతము
బట్టియుంటినిగాన నా ♦ పయిడిలేడి
బట్టితెమ్మంచు వేడు నీ ♦ పద్మగంధి
ముచ్చటం దీర్పగా నిదె ♦ పోవువాడ॥

కావున నీవు జానకిని జాగ్రత్తగ జూచుచుండుము.

లక్ష్మ—అన్నయ్యా! యిది నిక్కముగా మృగమని తలంచిపోవుచుంటిరా?

చ॥ దనుజులు మాయబన్నెదరు ♦ తద్దయు దాని నెరుంగజాల మో
మనుజవరేణ్యా! నామదికి ♦ మాయమృగంబనితోచెఁ జూడఁగాఁ
గనకమృగంబు నింతదను ♦ కన్నరిమెందును గాంచియుంటిమే
మనలను మోసపుచ్చ నిట ♦ మాయలబన్నిరి రాక్షసాధముల్ ॥

అన్నయ్యా! మన మింతకాలమునుండియు వనములఁ దిమ్మరుచుంటిమి గదా! ఇట్టి మాయలమారిమృగమును గనియుంటిమా? ఎవ్వరిచేనైన విని యుంటిమా? ఈ మృగము నిక్కముగా రాక్షసమాయయేసుడీ?

రాము—అన్నా! లక్ష్మణా! అట్టులయిన,

గీ॥ పసిడిమృగము నిజంబైన ♦ బట్టితెచ్చి
యిచ్చెదను దేవికిప్పుడే ♦ నిచ్చదీరఁ
గాక మాయామృగంబైన ♦ నీకఁడుంచి
హితమొనర్చెద జగమున ♦ కింపుగల్గ॥

కాన నేను వచ్చువరకు జానకిని భద్రముగా గాచియుండుము. అల్లదే పొదచాటునకు బోయినది. దానిఁ బట్టితెచ్చెద.

(అని రాముఁడు నిష్క్రమించును)

సీత—(కొంచెమూరకుండి) మఱదీ! లక్ష్మణా! మీయన్నగా రింకను రారైరి. కారణమేమి? నాముద్దులేడి దొరకినదికాదు కాబోలు!

(తెరలో—హా! సహోదరా! లక్ష్మణా! చచ్చితి! చచ్చితి!)

సీత—(తొట్రుపాటుతో) మఱదీ లక్ష్మణా! వింటివా?

గీ॥ ఆలకించగ మీయన్న ♦ యార్తరవము
హా! సహోదర! లక్ష్మణా ♦ యనఁగ వినవె?
కీడు చేకూరె రాముని ♦ జాడఁజూడ
బొమ్ము రక్షింప శ్రీరామ ♦ భూపునిపుడు॥

లక్ష్మ—అమ్మా! రఘూత్తమున కేవిపత్తులు చేరవు. వాసవపద్మజరుద్రాదులైన నామహాత్ము నెదిరింపజాలరు. జనుఁజాధముండు కొలచే నేలంగూలి నన్ను బిలుచుచుండెగాని యామహాత్ముని పల్కుగాదు. మునుమాటికి నమ్ముము.

సీత—లక్ష్మణా! (25 అనుబంధము.)

చ॥ దిగులుమనంబునంబొడమి ♦ దీనతవేడ దయావిహీనతన్
బగతుసిరీతి సూర్యకులుఁ ♦ బద్మదళాక్షుని చావుగోరితో
మగువలపాటియోజనలు ♦ మానసమందు దలంచవక్కటా
వగవక యెట్టులాగుదు న ♦ వారిగ దుఃఖము పొంగిపొర్లగన్॥

ఓయీ లక్ష్మణా! (26 అనుబంధము)

గీ॥ అనుజుఁడను నేనటంచని ♦ యధముఁడొకఁడు
రాజ్యసామ్రాజ్య సంపత్తి ♦ రహినిగొనియె
కపటబుద్ధిని నీవిప్డు ♦ కాన నటుల
నగ్రజునిచావుఁ గోరితో ♦ యదనుగాంచి॥

ఓరీ కిరాతా! రాముడు గతించిన పిదప నన్ను గ్రహించనెంచి నీయన్న క్షేమ మారయకుంటివిగదరా! కపటహృదయా! కన్నకనే పెద్దలు సవతుల బిడ్డలు పగవారని నుడివియుండిరి.

లక్ష్మ—శివ శివా! యెట్టి బెట్టిదఁపువాక్యము లాలింపవలసివచ్చెను. (ప్రకాశముగా) అమ్మా జానకీ!

ఉ॥ తల్లివి నీవెనాకు, మరి ♦ తద్దయు నా గుణముల్ గ్రహింప కి
ట్లుల్లమునందు తాపసము ♦ నూని ప్రలాపము లాడజెల్లునే?
తల్లడమందకింక గుణ ♦ ధాముని, రాముని చెంతకేగి యా
సల్లలితప్రచారు నిటు ♦ చయ్యన దోడ్కొనివత్తు నమ్మరో॥

(27 అనుబంధము.)

తల్లీ! ఈ ఘోరారణ్యమందు భీకరమృగములు పెక్కగలవు. కాన వానిఁజూచి బెగ్గిలకుము. దానవు లనేకమాయలు పన్నెదరు! అట్టి మాయలకు లోనుగాక పర్ణశాలయందే యుండుము. నేను పోయివచ్చెద. సెలవొసఁగుము. తల్లీ! నే నీయాశ్రమమున సప్తరేఖల గీచెదను. నీ వా రేఖల మిగిలివచ్చిన రామాజ్ఞ మీరినట్లే. నీవట్లు చరించితివేని మోసమువాటిల్లును. పద్మజరుద్రాదులు వచ్చినను రాకుము. పోయెద. (నిష్క్రమించును.)

సీత—హా! దైవమా!

గీ॥ హరిణి యీచాయరానేల ♦ నంతఁబతిని
నేను బొమ్మననేల, ♦ నద్దాని వెంటఁ
దాను బోనేల, నంత నా ♦ రార్తరవంబు
వీనులబ్బడనేల నా ♦ విధినిగనక
మునుము నొవ్వఁగ బల్క నా ♦ మఱది చనియె॥

అయ్యో దైవమా! యినకులోత్తమున కేమి ముప్పు చేకూరునో గదా! లక్ష్మణుడు సైతము పోయియుండె; నింకను వారు రారైరి.

(28 అనుబంధము.)

ఉ॥ రామునిబ్రోవ వేగముగ ♦ రారె దయామహా! సురవర్యులార! మీ
రా మునిచంద్రపాలకు న ♦ దయమ్మునతోడ్పడ రారె దిక్పతుల్
కామితమిచ్చు నావరుని ♦ గావరె బ్రోవరె కాననమ్మునన్!
దామసిలంగ నేనికను ♦ తాళ్మిని నిల్వఁగఁ జాల గావరే॥

అయ్యో దైవమా! పతిభిక్షబెట్టి నన్ను కావుము.

(అని కన్నులుమూసి కూర్చుండును.)

(రావణుడు సన్యాసివేషమున బ్రవేశము.)

రావ— జే, శంకర్ భగవాన్!

సీత—యతికులేంద్రా! వందనములు.

రావ—కల్యాణమస్తు! కల్యాణమస్తు! కాంతా!

ఉ॥ ఎవ్వతెవీవు? ఎందునికి? ♦ యెవ్వడు నాథుఁడు? టొంకిపీడి నీ
విప్పని కేలవచ్చితి వ ♦ దేమొకో తెల్పుము కామినీమణీ!
కొ్రవ్వన నిన్నుబట్ట మది ♦ గోరికజూతురు రాక్షసాధముల్
రివ్వన నాకు దెల్పుము బ ♦ ళీ! విధమెల్ల మరాళగామినీ!

సీత—అయ్యా! సంయమీంద్రా!

సీ॥ జనకభూమీశ్వర ♦ తనయను నాపేరు
జానకియందురు ♦ సన్మునీంద్ర!
ధర నయోధ్యాపురీ ♦ ధాముడౌ దశరథ
క్ష్మానాథుకోడల ♦ మౌనిచంద్ర!
శూరశిఖామణి ♦ శ్రీరామచంద్రుని
యర్థాంగినయ్య సం ♦ యమివరేణ్య!
తండ్రియానతి బతి ♦ దండకాటవిలోన
ననుగూడి వసియించె ♦ ననుజుతోడ
తే॥ గీ॥ కనకమృగమొండు గన్పడ ♦ కాననమున
నేను గోరిన నాథుండు ♦ దానిబట్ట
నరిగె తడవైన తమ్ముండు ♦ నరయఁబోయె
వారికాపద రాకుండ ♦ వరము లిమ్ము॥

తండ్రి! ఋషీంద్రా! యిట్లా బంగరులేడిని బట్టబోవ "హా! లక్ష్మణా" యను నార్తనాదము విపవచ్చె. వెంటనే శస్త్రాస్త్రసమేతుండై లక్ష్మణుం డన్నగారికి సంభవించిన ముప్పుఁ దప్పింప నేగియుండె. ఇంతవరకు రాఘవ రి. త్రికాలవేదులగు తమకెరుకకపడని యంశముండదు. నానాథునిజాడఁ దెల్పి నాచిత్తమున గలచింత బాప వేడుచుంటి. (అని నమస్కరించును.)

రావ—(తనలో) ఆహా! ఇదియే మంచిసమయము. ఇప్పు డీభూజాతను నరద ముపై నిడుకొని లంక కేగెద. (ప్రకాశ) సీతా! యిటువినుము.

చ॥ కలశభవుండు తాత గుణ ♦ గణ్యుఁడు విశ్రవసుండు తండ్రి నా
నిలయము హేమరత్నమణి ♦ నిర్మితమై వెలుగొందులంక యీ
యిలగల దానవప్రతతి ♦ నింపుగనేలెడివాఁడ ధారుణీ
స్థలి నను మీరు బల్లిదుఁడు ♦ చానరో లే డెట రావణాఖ్యుఁడన్॥

నీరూపలావణ్యము విని మదీయసఖీజనంబులవీడి నీకొరకై వచ్చి యుంటి. మదనుం డద నిదియని పరితాప మొందజేయుచుండె. సఖి! ఈ కాంతారంబున నీరాజాధమునిఁ గూడి నీ వేమిసుఖ మనుభవించెదవు? రామణీయకములగు నుత్తుంగహర్మ్యములయందును, కుసుమితలతాకుంజ పుంజముల నీడను ముదమార విహరించుచు నాలంకయం దకలంకముగ సుఖించ రమ్ము రమణీమణీ!

సీత—(కోపముతో)

గీ॥ కమలజుని వంశమునబుట్టి ♦ ఘనతవీడి
యిట్టు బల్కెదవేలరా ♦ మిట్టిపడుచు
హస్తిమశకాంతరం బొప్ప ♦ నరయ రామ
చంద్రునకు నీకుఁజూడ రా ♦ క్షసహతకుడ!

ఓరీ! నీవు మునివని నమ్మి యెరుఁగక యర్ఘ్యపాద్యంబులిడి మోసపోతిఁ గదరా?

రావ—సీతా! నా నిజరూపము జూడుము. (అని నిజరూపు జూపును.)

సీత—(మూర్ఛిల్లును.) —— (యవనిక పడును.)

పంచమరంగము – అరణ్యమందొక భాగము.

(రామలక్ష్మణుల ప్రవేశము.)

రాము—అన్నా లక్ష్మణా! మీావదినెనొంటిగావిడిచి యిట్లేలవచ్చితివి? అయ్యో! ఘో రారణ్యమున నాయింతి యేమయ్యెనో కదా!

గీ॥ రక్కసుల జాపిహార మ ♦ రణ్యమందు
వార లేరీతి మాయల ♦ బన్నినారో

జనకసుత కెట్టియాపద ♦ సంఘటిలెనొ
యొంటరిగ సీతనుంచి రా ♦ నుచితమగునె!

లక్ష్మ—అన్నయ్యా! మీ రామరంగమును బట్టవచ్చిన కొన్ని నిముసములకు "హా! లక్ష్మణా" యను నార్తనాదము వినవచ్చెను. అట్టినాదము విని భీతిల్లి దేవి నన్ను మీ క్షేమ మరయుటకై పొమ్మని పలికెను. నేను "త్రిలోకపూజ్యు లగు మాయన్నగారి కెట్టియాపదయు చేకూరదు. ఇదియంతయు రాక్షస మాయ"యని పల్కితి; అందులకామె నమ్మలేపక నన్ననేకగతులముల్కుల నించినపల్కుల బల్కజొచ్చినది. అందులకును మీయాజ్ఞ మీరినవాడ నగుదునని మిన్నకుంటి. అది గాంచి దేవిగారు మీకాపద చేకూరినదని దుఃఖించుచు నోటవచింపరాని మాటలు సైతము బల్కినది. అట్టి కర్ణకఠోర వాక్యము లాలింపజాలక మీచెంత కేగుదెంచియుంటి. దేవరవారీతప్పు క్షమించ ప్రార్థితులు. (అని నమస్కరించును.)

రాము—లక్ష్మణా! నా శౌర్య సాహసము లెరింగియు నా దేవి పొమ్మనినతోడనే వచ్చుట నీకు తగునా? స్త్రీలు భీతచిత్తలగుటచే ననేకవిధములఁ బల్కెదరు. ఇంతలో నీ వదిగని యిట్లు సేయుటేల? మఱచితివి. కురంగరూపధారి దనుజాధముఁడే. వాడు నన్నలయింప నెంచి చాలద వ్వరిగెను. అంతనేను నిక్కముగా రక్కసియని నిశ్చయించి వానిఁ బరిమార్చితిని. అన్నా! లక్ష్మణా! సీతయేమ య్యెనోగదా! పర్ణశాలకు బోదమురమ్ము.

---

షష్ఠమరంగము - పర్ణశాల.

(రామలక్ష్మణులు పునఃప్రవేశము.)

రాము—తమ్ముడా లక్ష్మణా! ఎట్టియాపద చేకూరినది. ఈ పర్ణశాలయందు జానకిని గాంచమైతిమే! పిలువుము.

లక్ష్మ—వదినెగారు! వదినెగారు! జనకరాజతనయా! ఏది పల్కుటలేదే! శ్రీరామ మనోహారిణీ! తల్లీ!

రాము— సీ॥ రేఱేఁడులేనట్టి ♦ తారాపథముభాతి
శారిక లేని పం ♦ జరముకరణి
సారసహీనకా ♦ సారంబుపోలిక
గనదివ్వెలేని యం ♦ గణముమాడ్కి
సుమఫలంబులులేని ♦ సుందరవనిగతి
పసిబిడ్డలేని భ ♦ వనమురీతి

కలకంఠతతిలేని ♦ కమ్మమావివితాన
నినుడులేనట్టి దు ♦ ర్దినము పగిది
తే॥ గీ॥ భూరితరమార్వి లేని కా ♦ ర్ముకమువలెను
నానెమగు తంతువులు లేని ♦ వీణెభంగి
జానకీదేవి లేనట్టి ♦ జాడఁజూడఁ
పాడుబారినటుంచె నీ ♦ పర్ణశాల॥

అయ్యో లక్ష్మణా! యెట్టియాపద చేకూరినది! దుష్టదానవు లెవ్వరైన సీత నెత్తికొనిపోయిరో, లేక కూరిమృగంబుల వాతపడెనో యెఱుంగమైతిమి గదా!

సీ॥ హరిణాక్షి సీతఁ గా ♦ రడవిని గంటిరే.
నమ్మి కాడరె హరి ♦ ణమ్ములార
మదగజయాన యీ ♦ మార్గాన బోయిన
సరణిగాంచితిరె గ ♦ జమ్ములార
హరిమధ్య యిప్పుడీ ♦ తెరువునఁ జనినట్టి
క్రమ మెఱుంగరె మృగేం ♦ ద్రమ్ములార
కలకంఠకంఠి ని ♦ క్కడ బొడగన్న ని
క్కమ్ము దెల్పరె పయి ♦ కమ్ములార
తే॥ గీ॥ కనికరమున జక్రస్తని ♦ చనినజాడ
గాంచిరేని జెప్పుడీరు చ ♦ క్రమ్ములార
దయను భూజాత పోయిన ♦ దారిగనిన
సరగునను దెల్పరారె భూ ♦ జమ్ములార!

హా! సీతా! యేమైతివి? రాము డేమిచేయునో యని యే లతలచాటున నైనఁ డాగియుంటివా? లక్ష్మణా! యీపార్శ్వమందు వెదకుదము రమ్ము. (కొంతదూరము నడచి) అయ్యో! యెంత వెదకినను గానరాకున్నదే! హా సీతా! జనకజాతా!

సీ॥ ఈకానలో గాన ♦ నేకాన గననౌన
మీనలోచన సీత ♦ గాన నకట
యీ వంక లేదాయె ♦ నేవంక కికబోదు
పంకజాక్షిని జూడ ♦ నింక నకట
భూసుత నినువీడి ♦ భాసురగతి నీడ
వేసారకెట్లు జీ ♦ వింతు నకట

(లక్ష్మణునిజూచి) కడకండ్ల పాఱజేసి ♦ విడనాడి వచ్చితో
పుడమిజాతను జూడ ♦ బోవ మకట

తే॥ గీ॥ అయ్యొ యింకేమిసేయుదు ♦ నతివ నెట్టి
రక్కసులు మ్రింగిరో యిట ♦ సురక్కలేక
పుట్టినిలుసొచ్చెనో వన ♦ భూమిలోన
తనువు విడనాడెనో కటా ♦ తరుణి యకట.

ఆఁ యేమి! యీరాముని వెఱ్ఱి! అయోధ్యనుండి యడవులకు వెడలునపుడే పుట్టినింటికి బొమ్మన నట్టిమాట జెవులబెట్టనని పల్కెనే! ఇట్టితరి యట్టిపని కొడిగట్టునా? వట్టిది. వట్టిది. నిక్కముగా నేపాపిని చేతనో పోనపోయినది. హా! సీతా! భువనజాతా! లక్ష్మణా! యిక నావైపున జూతము రమ్మా.

లక్ష్మ—చిత్తము. (అనికొంతదూరము నడుతురు.)

రాము—అయ్యో! యీ యరణ్యమందు నాసతి జాడనెఱింగించి నన్నాదరించువారు లేరుగదా! హా! భూజాతా!

( 29 అనుబంధము )

గీ॥ ఎండమావులలోని నీ ♦ రిందుజూడఁ
గనులు మిరుమిట్లుగొలిపె నా ♦ కలికిమిన్న
చెలియ నెడబాసి నే నెట్లు ♦ క్షితిని మనుట
జెప్పుమా యన్న లక్ష్మణా ♦ సీతజాడ॥

అనుజా లక్ష్మణా! సీతనుబాసి నే నొక్కనిమిషమైన నిక బ్రతుకజాల.

లక్ష్మ—అగ్రజా! ఘనిధులగు తమరు వేఱరీతి వాపోవ తగవుగాదు. ధైర్యమూనుడు. పిదప నీ కాంతారమందు సీతాకాంతను వెదకుదము.

( 30 అనుబంధము. )

రాము—ఇంకెక్కడిసీత? వెదకుటెక్కడ?

(అని కొంతదూరము పోవుదురు)

(అక్కడ జటాయువు పడియుండును.)

రాము—అనుజా లక్ష్మణా! చూచితివే?

గీ॥ జానకిని మ్రింగినట్టి యీ ♦ దానవుండు
మనము వచ్చుటగాంచి తా ♦ మ్రిందినటుల
పక్షిరూపంబు దాలిచి ♦ పడిన యితని
చంపెదనుజామిమీ యొక్క ♦ శరముచేత

(అని శరమెత్తును.)

జటా—ఆర్తజనశరణ్యా! రామచంద్రా! నేను జటాయువనువాఁడ. మీజనకుండగు దశరథేశ్వరుని ప్రియసఖుఁడ. అయ్యా! మీరిరువురు నింటలేని యదనుగని రాక్షసాధముఁడు జానకిని తనయరదంబుపై నిడికొని పోవుచుండె. అట్టితరి నా మహాదేవి యనేకవిధముల దైవమును గూర్చి వాపోవుచుండె. అప్పుడు నే నాయార్తనాదము విని యాయసురునితో ననేకవిధములఁబోరి వాని ఛత్రంబు మహీస్థలిం గూల్చితిని. చాపము దుంచివైచితిని. తురంగముల తుత్తురుముచేసితిని. వానిరథమును రూపుమాపితిని. అయ్యా రామచంద్రా! యిట్లాదనుజుని యనేకవిధముల పరిభవము చేసితిని. పిమ్మట క్రోధమాన సుండై వాడిగల విశిఖంబుల నాపైఁబరపి నాపక్షముల ద్రెంచి సీతా మహాదేవిని గైకొని గగనమార్గమున జనియె. పక్షవిహీనుండనై రుధిర స్రావముచే మేనల్లడడిసి యిచ్చట బడియుంటిని.

రాము—అయ్యా! ఖగకులేంద్రా! రక్కసివాతంబడి సీత నష్టమనియెను? నాదను జాధముం డెందుజనియెను? వానినామంబెద్ది? ఆదురాత్ముం డెవనిపుత్రుఁడు? వానిబలదర్పములేమి? సత్వరము జెప్పుము. వానినిబట్టి యిప్పుడే తుంచివచ్చెద.

జటా—అయ్యా! రామచంద్రా! వాఁ డమితవైభవసంపన్న బలాఢ్యుఁడు. వాని పేరు రావణుఁడు. సీతామహాదేవింగొని దక్షిణాభిముఖుఁడై చయ్యనఁ జనియె. వానిరూపము పదిశిరంబులచేతను నిరువదికరములచేతను జూడ భీతిగల్గును.

రాము—పక్షిరాజేంద్రా! వానివాసస్థానమెయ్యది?

జటా—రఘుకులేంద్రా! శతయోజన విస్తీర్ణమగు లంకాపట్టణము. వానిని సంగ్రామంబున దునిమి విజయలక్ష్మినిం బడసి సీతాసమేతుండవై రాజ్యంబు పాలించెదవు. మనమున దిగులొందకుము. అయ్యా! ఈ యుదంతము నీ కెరిఁగింతమని యింతదనుక నాప్రాణవాయువుల జిక్కబట్టితి. కాని యిక మనఁజాల. నామేన ప్రాణములు లేచిపోవుచున్నవి. రామ! రామ! రామ!
(అని క్రిందపడి తన్నుకొని చచ్చును.)

రాము—లక్ష్మణా! యేమీ యీకాలవైపరీత్యము! అక్కఱకువచ్చువానికేగదా యాపదవచ్చుట.

చం॥ జనకుఁడుచచ్చినట్టవగవ, ♦ జానకిఁబాసిన వంతనొంద, నా
జనకుని మించుప్రేమగల ♦ చక్కనిరాజవిహంగ మక్కటా!
దనుజునిచేత నొంపఁబడి ♦ తా దివికేగను మీదికార్య మీ
ఘనుఁడగు బక్షిరాజునకు ♦ గాంక్షనొనర్చెద నగ్నిసత్క్రియల్॥

సౌమిత్రీ! మన కుపకారము సేయనెంచి మృతినొందిన యీజటాయుమృతి జూడ సీతావియోగమును మించియుండె. మన కీపక్షీంద్రుఁడు దశరథుని యట్ల పూజ్యుండును మాననీయుఁడును. కాన నీవిహగేంద్రుని కగ్నిసంస్కార మాచరించవలయు.

లక్ష్మ—చిత్తము! దేవరవారియాజ్ఞ శిరసావహించెద.

రాము—లక్ష్మణా! పక్షీంద్రుని దహనభూమికి గైకొనిపోదము రమ్ము.

రామ-లక్ష్మ—(పక్షి నెత్తుకొని పోవుదురు.)

(యవనిక పడును.)

తృతీయాంకము సంపూర్ణము





శ్రీ

# సంపూర్ణ రామాయణము

## తురీయాంకము

ప్రథమరంగము - ఋశ్యమూకపర్వతము

(హనుమంతుడు, సుగ్రీవుఁడు, కొందరు వానరులు ప్రవేశము)

(31 అనుబంధము)

సుగ్రీ—ఓయీ పవనాత్మజా! ప్రచ్ఛన్నవేషధారులగు యువకు లిరు బాణబాణాసనముల ధరించి వచ్చుచుండిరి. వార లీవనమున కేల వచ్చుచుండిరో యెచ్చటనుండి యెచ్చటకేగుచుండిరో, సత్వరమున గ్రహించిరమ్ము. వారిం జూడచూడ వాలిపనుపున వచ్చినట్లు నాకు సందియము తోచుచున్నది.

హను—అయ్యా సుగ్రీవా! వారలు వాలిపనుపున వచ్చువారలు కారని తలంచెదను.

సుగ్రీ—కానిమ్ము! వారలు నిజముగా మునులైనచో ప్రియమార నీవు వారలం గలిసి నాతో సఖ్యమగునట్లు చేయుము. పొమ్ము. నే నీగిరిగహ్వరమందు నివసించియుండెద. సత్వరము రమ్ము.

(ఇద్దరు నిష్క్రమింతురు.)

---

ద్వితీయరంగము - నగప్రాంతము.

(రామ, లక్ష్మణ, హనుమంతులు ప్రవేశము.)

హను—అయ్యా! రఘుకులేంద్రా! యీగహ్వరముననే కపికులేంద్రుఁడగు సుగ్రీవుఁడుండె. రండు పోదము.

(సుగ్రీవుఁడు ప్రవేశము.)

సుగ్రీ—ఆర్యులారా! వందన మాచరించుచున్నాఁడ.

హను—అయ్యా, కపీంద్రా! వీరలు.

గీ॥ దశరథునిపుత్త్రు లినకులో ♦ త్తములుసుమ్ము
రామలక్ష్మణు లనుపేర ♦ రాజిలుదురు
కర్మవశమున వచ్చి రి ♦ క్కడికి వీరు
శౌర్యధనులయ్య మైత్త్రికి ♦ సరసులయ్య॥

సుగ్రీవా! ధర్మజ్ఞుండును సత్యసంధుఁడును, పితృవాక్య పరిపాలకుండును, సధికబలపరాక్రముండును, ఆశ్రితజనవత్సలుండును నగు నీరామచంద్రుని సఖ్యంబు గల్గెగాన నీ మనోరథంబు సఫలంబు కాగలదు. వీరలు జనకాజ్ఞ నిలుప నడవి కేతెంచి యుండ తనపత్ని రాక్షసాపహృతయైన కారణంబున నాసతికొఱకు వనముల దిమ్మరుచుండిరి. వీరు మహానుభావులు, వీరి చెలిమిచే నీకు మేలు చేకూరు. ధైర్యమూనుము.

సుగ్రీ—అయ్యా రామచంద్రా! మీకును కాంతావియోగమే సంఘటిల్లినదా?

రాము—అయ్యా కపీంద్రా! నాదుఃఖమునకు మేరయే లేదు.

సుగ్రీ—ఇనకులతిలకా!

గీ॥ రావణుని యరదమునందు ♦ రాజవదన
యొండు ఘోరున నేడ్చుచు ♦ నుండి తనదు
రత్నమయ విభూషణంబుల ♦ రామచంద్ర!
చేలమునఁ గట్టివైచె మా ♦ చెంతబడఁగ॥

అంత నేనా నగలయుత్తరీయంబును భద్రపరచితి. దేవరవారి యనుజ్ఞయైన నాభూషణాంబరముల దెచ్చెద.

రాము—అయ్యా! కొనిరమ్ము.

సుగ్రీ—చిత్తము.

(నిష్క్రమించి మూటతో బ్రవేశించి రామునకిచ్చును.)

రాము—(మూట చేతబట్టుకొని) అనుజా! లక్ష్మణా!

చం॥ జనకజమేని భూషలివి ♦ జానకిదాల్చిన యుత్తరీయమే
యనుజ గనుంగొనంగ మది ♦ నాపగరాని వగల్ జనించె నా
దనుజునిచేత జిక్కువడి ♦ దారినిబోవుచు భూషణావళుల్
తనమది గుందుచుం విడిచె ♦ ధారుణిపై గనుమింక తమ్ముడా!

ప్లవంగేశ్వరా! వా డేదిక్కుగబోయియుండె జెప్పుము. వానితలవ్రక్కలు చేసెద. సత్వరముగా బల్కుము. (కొంచెమూరకుండి) సుగ్రీవా! వాని నేవిధముగా బరిమార్చగలము? మరల నాదేవి నెట్లు గాంతును.

సుగ్రీ—అయ్యా! దుఃఖించకుఁడు. వానిని కదనమందు ఖండించి భూజాతను దెచ్చెదను. ధైర్యమూనుడు.

రాము:— గీ॥ నీవు కోరినకోర్కెల ♦ నేను దీర్తు
జానకిని దెచ్చుజాడల ♦ నరణిదెల్పు
సుగ్రీ— మీరు నేనును గూడిన ♦ మేదినీశ
కష్టతరమైన కార్యము ♦ గలుగగలదె॥

సీతను దెచ్చియిచ్చు భారము నాయది. మీరు చింతింపకుడు. దేవా! నా మనవి చిత్తగింపుడు. (32 అనుబంధము.)

మ॥ బలిమిన్నాసతిబట్టి దోచుకొని కో ♦ ప బూని కిష్కింధలో
వల నన్నున్వసియింపనీక వనికిన్ ♦ బారంగదోలెన్. మహా
బలుడౌ వాలి; యతండు చంపునని నే ♦ ప్రాణంబుపైఁ దీపిచే
నెలనాగన్ విడనాడియుంటి నకటా ♦ యీ ఋశ్యమూకాద్రిపై॥

రామచంద్రా! ఇట్టి ఇడుమలకు లోనై కులాంగనను బాసి, కుందుచుండిన ఈ యనాథను గావుము. (అని పాదములపైఁ బడును.)

రాము:—కపిచంద్రా! లెమ్ము భీతిల్లకుము. దుర్నీతిపరుండగు వాలిని నాశితసాయకములచే ఖండించి నిన్ను కిష్కింధాపురమున నభిషిక్తునిగా జేసెద. ఎట్లయినను నీవు వాలిని గయ్యంబున కాహ్వానంబుచేయుము. జాగుసేయక కపిసేనతో కిష్కింధకుం జనుము. నేనును నీవెంటనే వచ్చి వాలిని దూలగొట్టెద.

సుగ్రీ—చిత్తము మహాప్రసాదము. (అందరు నిష్క్రమింతురు.)

(యవనిక పడును.)

---

## తృతీయరంగము - అరణ్యము.

(వాలిసుగ్రీవులు శరములతోడను రామలక్ష్మణులు చెట్టుచాటునను గన్పట్టుదురు.)

సుగ్రీ—ఓరీ! భ్రాతృద్రోహీ!

ఉ॥ ఆలిని స్వీకరించితి వ ♦ హా! రణభూమికి రమ్ము సత్వరన్
గాలవశమ్ముచే నిటులఁ ♦ గానలనుండితి నిన్నినాళ్ళు నే
నాలము సేయవచ్చితి మ ♦ హాహవమందున గెల్చిపొమ్ము నీ
కాలము దాపరించినది ♦ కావురముండగ స్వర్గమందునన్॥

వాలి—ఓరీ!

మ॥ కానల డాగిడాగి వన ♦ కందములన్ దిని మత్తుమీరి యీ
కోనల నేడ్చి యేడ్చి మరి ♦ కొన్నిటికోతులఁ గూడివచ్చు మా
తా్ౕరినను జెట్టిజెట్టినని ♦ తాకఁగ నామది జంకుపుట్టునే
పానలు లేగలేక నిను ♦ బంపెదఁ గాలుని వీటికిప్పుడే॥

ఓరీ! మాటలచే నేల గాలయాపన చేసెదవు? నీచేవ జూపుము. బాణప్రహారములు వచ్చుచున్నవి గాచుకొనుము. (అని బాణములు వేయును.)

సుగ్రీ—ఓరీ! నీబాణముల సంహరించితి. ఇక నాయమ్ములకమ్మదనము జూడుము. (అని బాణము వేయును.) (రాముఁడు చెట్టుచాటునుండి బాణము వేయును.)

వాలి—(క్రిందబడి) హా! మోసకారీ! చచ్చితి, చచ్చితి. ఓరీ సుగ్రీవా! జననమైన పిమ్మట మరణ మున్నదైనను మనకెల్లరకు నిశ్చయము. కావున మరణమునకు సర్వజనులు సిద్ధముగా నుండవలసినదే. కాని నా యారవ ప్రాణమగు,

ఉ॥ అంగదు జూడుమింక కన ♦ కాంగదు సుందరమూర్తి పుత్రి నే
బొంగుచు నంకమందునిడి ♦ పొల్పగ ముద్దుల నాడుచుండు నీ
వుం గమనించి శైశవము ♦ బుచ్చుము సంతసకుప్ప వాని నా
మంగళమూర్తియౌ సుతుని ♦ మారునిమీరిన రూపవంతునిన్॥

అన్యాయము జేసితివిగదా. అయ్యా రామచంద్రా! యిట్టి నాపుత్రి నెట్లు బ్రోచెదరో మీరలే భారకర్తలు. కట్టని వయసుతీరువరకు సుగ్రీవుని రాజ్యాభిషిక్తుని జేయుడు. పిమ్మట నా బుడతడే గలడు. నేనిదే ప్రాణముల విడుచుచున్నాడ. రామ! రామ! రామ! (అని ప్రాణము విడుచును)

(తెరవనిక జారును.)

(అదేస్థలమున అంగద, లక్ష్మణులు ప్రవేశము.)

అంగ—హా! తండ్రీ! భువనైకవీర!

ఉ॥ ఎత్తితివెల్లశైలము ల ♦ హీనయశంబుగ నేల నేలితో
మొత్తితివెల్ల శాత్రవన ♦ మూహముల౯ దగు కోటకొమ్మల౯
దుత్తునియల్ల గొట్టితివి ♦ దోర్బలలీలల బేరుగాంచితో
యిత్తరి రామబాణమున ♦ నేగితొ స్వర్గము మమ్ముఁవీడియు౯॥

హాతండ్రీ! జగత్త్రైకవీరా!

గీ॥ పిన్నతనమునుండి న౯ ♦ బ్రేమచేత
పెంచితివి తండ్రి నిన్నిట ♦ బ్రేతభూమి
జేర్చగాబూని తక్కటా ♦ చింతలుడిగి
కటకటా! మెట్లుచేతు నీ ♦ కట్టడిపని॥

హా తండ్రీ! నిన్నుబాసి నేనొక్కనిమిషమైనను బ్రతుకగలనా? అయ్యో! తండ్రీ! కపివీరా! (అని మూర్ఛిల్లును.)

లక్ష్మ—అంగదకుమారా! బేలరీతి వాపోయెదవేల? యిట్టితరి మనమును రాయిజేసి కొనవలెగాని నీరుచేయుదగునా? ఇక చింతింపకుము. నీతండ్రి రామాస్త్ర నిహతుఁడగుటచే నాకవాసప్రాప్తి జెందియుండెగాన నీమనమున దిగులు మాపికొని నీతండ్రికగ్నిసంస్కార మాచరింపుము. ఇంక జాగుసేయక రమ్ము.

అంగ—చిత్తము అట్లనేచేసెద. (అసిలేచును. యవనికపడును.)

---

తురీయరంగము - కిష్కింధాపురము.

(రాముఁడు - లక్ష్మణుఁడు ప్రవేశము.)

రాము—తమ్ముఁడా లక్ష్మణా! సుగ్రీవుఁడింకను రాడయ్యె. రాజ్యమత్తతచే స్త్రీలోలుఁడై మున్నుబల్కిన గడువుమాటయే మఱచినాఁడు. నీవు కిష్కింధకుజని నావచనములుగ నిట్లనుము. (33 అనుబంధము.)

చ॥ "తలపవు తొల్లిబల్కినది; ♦ తామరసాక్షులఁ గూడిమత్తతన్
నిలిచి యిటాలసించితివి ♦ నీదగుసేనలఁ గూడిరమ్మికన్
దెలిసియు రానిచో వెనుక ♦ దీవ్రత వాలినిద్రుంచినట్టి యు
మ్ములుకలవంచు నమ్మి మెద ♦ బూనకు మూర్ఖత వానరేశ్వరా॥

"బుద్ధిమంతుడవని నీకు నే నుపకారముసేయు గురుకార్యోచితకాల మెరుంగవైతివే! నాచెలిమిగాంచినను వానరబుద్ధి మానవైతివిగదా, రామప్రసాద రాజ్యగర్వాంధకార!" యని నాసందేశములుగా బల్కుము. అందులకు సమ్మతింపకున్నచో నాకార్యమును నేనుదీర్చెద.

లక్ష్మ—చిత్తము. అట్లనేపోయెద. (నిష్క్రమించును.)

రాము—(తనలో) లక్ష్మణుడు వచ్చులోగా కాల్యకృత్యంబుల తీర్చుకొనియెద.

(రాముడు నిష్క్రమించును.)

(అదేస్థలమున హనుమత్సుగ్రీవ, లక్ష్మణులుప్రవేశము, పిమ్మట రాముడుప్రవేశము.)

సుగ్రీ—దశరథనందనా! శరణు! శరణు! (అనిపాదములపైబడును.)

రాము—ఓయీ సుగ్రీవా! రాజ్యమదాంధకారముచే కన్నుగానక చరించుచుంటివా!

సుగ్రీ—రామచంద్రా! మీకరుణాకటాక్షవీక్షణముచే నాకు సర్వసంపదలు చేకూర స్వామికార్యము దీర్పక మిన్నకుందునా? కొంతవానరసేనను సీతాన్వేషణార్థము బనిచియుంటిని. మిగిలినసేనను గూర్చుకొని నేను లంకకేగి రావణు సపుత్రమిత్రామాత్యపరివారముగఁ బరిమార్చి సకలకల్యాణగుణగణసమేతయగు సీతను గొనితెచ్చెదను. దేవర వారనుగ్రహింతురుగాక!

రాము—మంచిది. శీఘ్రముగా స్వామికార్యము దీర్చిరమ్ము. నేను సౌమిత్రియు మహేంద్రగిరియం దుండెదము.

సుగ్రీ—అట్లనే చేసెదము.

(రామలక్ష్మణులు నిష్క్రమింతురు.)

సుగ్రీ—ఆంజనేయా! అంగద జాంబవంత సుషేణ గజగవయులం గూడి దక్షిణ నీరధి లంఘించి లంకప్రవేశించి లోకమాతయగు సీతను వెదకుడు.

ఆంజ—చిత్తము, సెలవొసంగుడు. పోయివచ్చెదను.

సుగ్రీ—మంచిది. ఈ రెండుమాసములలో సీతనుగాంచి శుభవార్త లెరిగించుడు. లేకున్న మీకు మానప్రాణములు దక్కవు.

(సుగ్రీవుఁడు నిష్క్రమించును.)

ఆంజ—కపిపుంగవులారా! రండు పోదము.

వానరులు—అదెంతపని? పోదము రండు.

(అని గంతులువైచుచు అందరు నిష్క్రమింతురు.)

---

పంచమరంగము - సముద్రపుటొడ్డు.

(హనుమంత, అంగద, జాంబవంత, సుషేణాదులు ప్రవేశము.)

అంగ—వనౌకసులారా! సీతాన్వేషణముకొరకు స్వయంప్రభాగుహాముఖంబు నేనాడు విడిచితిమో యానాడే ప్రాణములపై యాశ వదలుకొంటిమి. ఇప్పుడు మనము సుగ్రీవునిచెంత కేగితిమేని మనల బ్రతుకనీయఁడు. ఒకవేళ మిమ్ము బ్రతుకనిచ్చినను నన్ను బ్రతుకనీయఁడు. ఏలయన మాతండ్రియెడగల వైరముచేతను రాజ్యరమ నాకొసగవలెనను దురుద్దేశముచేతను నింక కొన్ని విషయములు మనమున దలచి యింతకూరకార్యము జేయుగాన నే నీ నీరధి తటంబున బ్రాణంబులు విడిచెద. మీరు పొండు.

ఆంజ—అంగదా! యువరాజ్యపదవి నొసంగిన మీపినతండ్రి సుగ్రీవుఁడు నిన్ను జంపునా? యేమీ నీ వెడగుతనము!

అంగ—అయ్యో! వాయుసూతీ! యేల నీయోదార్పులు? సుగ్రీవుఁడు నన్ను నిక్కముగా నీమిషచే జంపును.

సుషే—కపులారా! మనము సీతనారయక రిక్తప్రసంగములచే గాలము గడపి పురప్రవేశమ్మతిమేని, సుగ్రీవునిచే మరణము నిశ్చయము; కాన నింక జాగుసేయక కార్యమునకు సాహసింతము రండు.

(అని ముందుకు నడతురు, సంపాతి ప్రవేశము.)

సంపా—ఆహా! ఇక్కడ నేదియో పెద్దయాహారము దైవము నాకు చేకూర్చె. ఇంక నీ మృగముల నన్నింటి నొకదాని వెనుక నొకటి నాపొట్ట బెట్టుకొనెద.

అంగ—వనౌకసులారా!

గీ॥ సీత వెదకుట యను మిష ♦ చేత మనలఁ
ప్రాణములఁ దీయగానెంచి ♦ పాపవిధి

ఫాలతలమున లిఖయించె ♦ పాపమనక
రామలక్ష్మణులైన మ ♦ రేమిచేయు॥

శ్రీరాముని వనవాసములచే దశరథునిమరణమును, సీతాపహరణముచే బక్షివధయు వాలి మరణముచే మనకు జావును గల్గె. ఇట్టిచెట్టిదంపు కార్యములన్నియు నేకకారణముననేగదా గల్గినవి.

సంపా—అయ్యా! మీరెవ్వరు? పక్షివధయనుచున్నారేమి?

అంజ—అయ్యా! మేము ప్లవంగేశ్వరులము. అయోధ్యాపురీశుఁడగు దశరథతనయుఁడు రాముండు తండ్రిపనుపున కానజేరి కొన్నిదినములుండ సీతను రావణుఁడను రక్కసుఁడు దొంగిలె. దశరథసఖుఁడగు జటాయువు సీతాపహరణము జూడలేక రావణునితో బోరి చచ్చె. రావణుఁడు జానకిని యెందుంచినది వెతుకుటకై రామసుగ్రీవులు మమ్ముపనుప నీ వనప్రదేశము లెల్ల వెతుకుచుంటిమి. అయ్యా! పక్షీంద్రమా! సీతజాడ నీకేమైన దెలియునా?

సంపా—అయ్యా! జటాయువు చచ్చెనా? హా! సోదరా! మనమేల పంతమువహించవలెను? అయ్యో! నీ మరణవేళ నెంతసంతాపమొందితివోగదా! హా! సోదరా! నాకింక దిక్కెవ్వరు?

అంగ—అయ్యా! పక్షీంద్రమా! చింతించకుము. పంతమనుచుంటివే, యేమది? జరిగిన వృత్తాంతమంతయు సవిస్తరముగా నుడువుము.

సంపా—అయ్యా! మే మిరువరము పంతమూని గగనమార్గమున నురుకుచుండ భానుకిరణజ్వాలలకు నాపక్షములు గమలిపోయి వింధ్యగిరిపైబడితి. అటబడిన యారుదినములకు నామూర్ఛ దెలిసెను. అప్పటినుండియు నేను పుడమిపై బ్రాకి ప్రాకి నేటికి జలధిదరికి జేరితిని. మున్ను నిశాకరుండను మునివరుండు చెప్పిన చొప్పున మిమ్ములగంటి. ఇంక మీకు సీతావృత్తాంతము జెప్పెద. కావున నకుచినగు నన్ను జలధియందు స్నానముచేయించి యిచ్చో గూర్చుండబెట్టుడు.

వాన—పక్షీంద్రమా! మహాప్రసాదము.

(లోనికి దీసికొనిపోయి మరలతెచ్చి కూర్చుండబెట్టెదరు.)

సంపా—(నాలుగువైపులజూచి) వానరులారా! రాముదేవేరియగు సీతామహాదేవిని రావణుడు లంకయందుగల యశోకవనమం దుంచినాడు. కావున మీరు నీరధిదాటప్రయత్నింపుడు. రామనామస్మరణచే నాకు మరల యథాశక్తి కలిగినది. నేనేగెద. (అని యెగిరిపోవును)

జాంబ—ఓయీ వానరులారా! మనకు గడువు సమీపించినది గాన,

ఉ॥ ఎవ్వఁడు రాముునాజ్ఞ గ్రహించి యించి శిరంబునఁ దాల్చినట్టివా
డెవ్వఁడు వార్ధిదాటి వడి నెవ్వఁడు లంకను జేర బారు నిం
కెవ్వఁడు సీతజాడలను నింపుగఁ గన్గొనజాలినట్టివాఁ
డెవ్వఁడు బోయిరాఁగలుగు నెవ్వఁడు చెప్పడి జాగు సేయకన్॥

గజు—తాతగారు! నేను, (34 అనుబంధము.)

క॥ పదియోజనంబు లేగెద
విదితంబుగ నవలబోవ భీతిజనించున్
బదపడి సంద్రముదాటఁగ
మది ధైర్యము లేదు నాకు మానితచరితా॥

గవా— క॥ చనియెద నిరువదియామడ
వననిధి లఘింపగా జ వంబు లవంబున్
గన నైతినంచు మిక్కిలి
మనమునను విచారమొదవు మాన్యచరిత్రా॥

కావున నే నట్టికార్యమునకు జాలనని పల్కుటకు వగచుచున్నాను.

సుషే—తాతగారు! నేను,

గీ॥ ఊహ సేయంగ డెబ్బది యోజనములు
జవమునన్ దాటగా నేర్తు సచ్చరిత్ర
తక్కగల యోజనంబుల దాటజాల
ననెడి భీతి మనంబున నందితయ్య॥

తాతగారూ! నాకు డెబ్బదియోజనములుపోవ ధైర్యమున్నదిగాని తక్కిన ముప్పదియోజనములు బోవ నే నసమర్థుండ.

జాంబ— ప్లవంగేశ్వరులారా! యిటువంటి శతయోజనంబులు శతమైనను నాకు లెక్కలేవు. కాని మున్ను త్రివిక్రమునకు ప్రదక్షిణము సేయునపుడు నా మోకాటిచుం దొక శైలము విరిగియున్నది. ఇప్పటికిని కొలఁదిదూరము దూకిన కలుక్కుమని బాధించును. అయినను మీ రీకార్యమునకు సాహసించు మనిన సాహసించెద.

అంగ—తాతగారూ!

గీ॥ యోజనశతంబు దాటగా నోర్తుగాని
మగుడ వననిధి లంఘింప మాన్యచరిత!

శక్తి చాలదటంచు సం ♦ శయము వొడము
సీతజాడల నెట్టుల ♦ జెప్పచేర్తు॥

అయినను బ్రయత్నించెద. సెలవొసంగుడు.

జాంబ—యువరాజా! నీవంతటి సాహసుండవే! కాని నీవు మాకు మూలంబవు. మేము నీకు శాఖాపుష్పఫలంబులము. మూలంబే లేనివాడల శాఖాపుష్ప ఫలంబు లుండునా? నీవు మాకు గురుండవు, గురుపుత్రుండవు, రాజువుగాన నిన్ను లంక కుంబనిపిన మా గతియేమి?

అంగ—సద్గుణవంతా! జాంబవంతా! మనము రామరాణ్యన్వేషణము జేయవచ్చి యసమర్థులమని పోయిన సుగ్రీవుండు ప్రాణములతో నుంచడు. కాన నేను! పోయి యెట్లైన రాముదేవేరిని దర్శించి వచ్చెద. సెలవొసంగుము.

జాంబ—యువరాజా! నీ వీకార్యమునకు సాహసించవలదు. ఓయీ! అంజనీపుత్రా! నేమియు చేతకానివానివలె నూరకుండుట నీకు తగునా? నాయనా! అంజ నేయా! సముద్రోల్లంఘనము సేయ నీవుదక్క యీ ప్లవంగేశ్వరులయం దొక్కరుండును గానఁబడడయ్యె గావున సీతాన్వేషణము నీవలన గాదగునని నిశ్చయించితిని. నాయనా! రాముదేవేరిని దర్శింప లంకకు పయనముగమ్ము. నీయట్టి సాహసమూర్తి యీ పనికి సాహసింపకున్న నేమియు చేతకాని వారేమిచేయుదురోయి? ఇంక మౌనమువీడి రామకార్యాసక్తుఁడవుగమ్ము. నాయనా! మనకు సుగ్రీవుడు నిర్ణయించినగడువుకొలదిరోజులలోనే యున్నది. నీవింక జాగుసేయక జలనిధి లంఘించి లంక నిశ్శంకఁజొచ్చి జానకిని దర్శించి రమ్ము.

అంజ—చిత్తము తాతగారూ! నన్నింతగా కీర్తించవలెనా? వీరలసాహసము వినుటకై మిన్నకుంటిఁ గాని వేరొంటుగాదు. ఇపుడు తమ సెలవయ్యెనేని,

(35 అనుబంధము.)

సీ॥ వాయువేగంబున ♦ వడిబోదు మీయాజ్ఞ
సూర్యచంద్రాదులు ♦ సుడివడంగ
విరిగి శైలాగ్రముల్ ♦ విపుల వృక్షసమూహ
మెగిరి మింటికిజేరి ♦ యిలబడంగ
వరగిరీంద్రమ్ములు ♦ వడవడ వడకంగ
భూనభోంతరములు ♦ బొబ్బలిడఁగ
తోయధులెల్లను ♦ దూలిపొర్లాడంగ
దిక్కులు పెక్కుగాఁ ♦ బిక్కటిలఁగ

తే॥ గీ॥ ధాటి వారాశి యవలీల ♦ దాటినేను
లంక నిశ్శంకఁ జొచ్చి స ♦ ల్లలిత సీత
జాడ లెల్లను దెల్పెద ♦ సత్వరముగ
నరుగుదెంచెద సెలవిమ్మ ♦ యధిక ప్రీతి॥

కపిపుంగవులారా! తమయాశీర్వాదముచేతను, యువరాజు దీవనచేతను శ్రీరామమంత్రబలముచేతను, నింక లంకఁ జొచ్చెద. సెలవొసంగుఁడు.

జాంబ—ఆంజనేయా! మంచిది పోయిరమ్ము.

ఆంజ—చిత్తము. సర్వము రామమహిమయే.

("రామ, రామ, రామ" యని యెగిరిపోవును.)

అంగ—కపిపుంగవులారా! ఆహా! మనయాంజనేయునిజవ మేమనివర్ణింతును! అతనిఘాతకు నిలువలేక భూధరంబులెల్ల నల్లలనాడుచున్నవి చూడుఁడు. ఔరా వాతజాత!

జాంబ—ఔను కపులారా! ఆంజనేయుని వర్ణింప నెవరితరమగును? ఓయీ! అంగదా! ఆంజనేయుని రాక నిరీక్షించుచు స్వయంప్రభాగుహాముఖంబున నుందము రండు.

అంగ—చిత్తము, అట్లనే సేయుదము.

(అందరు నిష్క్రమింతురు.)

తురీయాంకము సంపూర్ణము.





శ్రీ

# సంపూర్ణ రామాయణము

## పంచమాంకము

### ప్రథమరంగము - కోటముంగిలి

(ఆంజనేయులు, లంఘిణి ప్రవేశము.)

లంఘి— ఆఁ ఎక్కడి దీ వింతమృగము?

గీ॥ ఎవ్వడవుర, యిచ్చోటి కీ ♦ కేల వడిగ
వచ్చితివి గొంకులేక నిక ♦ వధయొనర్తు
జెప్పువృత్తాంతమంత నో ♦ చెనటికోతి!
పిప్పిగంతులు జాలించి ♦ వేగిరంబ॥

ఓరీ! అడవియందుగల ఆకలములుదిని మత్తుచే నిక్కడికి వచ్చితివా? ఇంక నిన్విడుచుటలేదు. నీవృత్తాంతమంతయు విశదపరచుము.

ఆంజ—ఓసి! నేను శ్రీరామదూతను. హనుమంతుడ. మీ లంకాపట్టణంబునగల వాపీ కూప తటాకంబులు జూడవచ్చితిని. ఒక్కపరి లోనికి బోనిమ్ము.

లంఘి—ఓరీ! రావణుని సెలవులేనిది పోవుటకు వీలులేదు.

ఆంజ— నన్ను పోనిచ్చెదవేని లంకలోని టెంకాయ తెచ్చిపెట్టెద.

లంఘి—టెంకాయలులేవు, గింకాయలులేవు, ఇకపొమ్ము.

ఆంజ—అట్లనే పోయెద. (అనిలోపలికిపోవ ప్రయత్నించును.)

లంఘి—ఓరీ! వెధవా! యెచ్చటికి బోయెదవు? (అని నెత్తినకొట్టును.)

ఆంజ—ఓసి మొండిరండా! యెంతధానవే! మగవాండ్రి మగనివలె గన్పట్టుచున్నావు.

గీ॥ పడతివంచును నినుజంపఁ ♦ బాపమనుచు
మిన్నకుండిన గని మితి ♦ మీఱి యిట్లు

మిట్టిపడుచుంటివా నీదు ♦ మిట్టిపాటు
నడఁచెదనుచూడు క్షణములో ♦ నసురరండ!

(అని గుద్దును.)

లంఘి—(క్రిందబడి) అయ్యో హనుమంతా! రావణుఁడు సీతను దెచ్చుననియు, సీతాన్వేషణముకొరకు మర్కటులు వచ్చెదరనియు, ఆ మర్కటునిచే దెబ్బ తిందువనియు, నాటనుండియు నీలంకకు చేటుగల్గుననియు, పిమ్మట రావణుని కుటుంబనాశన మగుననియు తొల్లి బ్రహ్మదేవుఁడు దెల్పియుండె. అతఁడు చెప్పినట్టు నీగుద్దునకు బ్రాణావశిష్టురాలనైతి. కావున న న్ననుగ్రహించి వీడి యథేచ్ఛగా లంకాపురమంతయు గలయఁదిరుగుము. నాకు సెలవొసంగుము.

ఆంజ—ఔరా! మంకిణి! ఎంతదానవే! నీ లంకావాసుల గుండెలలోని గాలమని తలంచు టెరుగవేమి?

(లంఘిణి నిష్క్రమించును.)

ఆంజ—ఆహా! యేమియీ! యీ లంకాపట్టణవైభవము!

హరిణగతి రగడ:—

ఈపురివైభవ ♦ మేమనియనదగు
కాపురమా శ్రీ ♦ కాంతామణికగు
గోపుర మందిర ♦ కోష్ఠప్రహారులు
గోపనలెంకలు ♦ గొప్ప బజారులు
బంగరు గోడలు ♦ పరిసోయగములు
పొంగుచు దిరిగెడు ♦ పొలతులగోటులు
మాకందంబులు ♦ మాజీఫలములు
శ్రీకదళంబులు ♦ శ్రీగంధంబులు
పనసలు కమ్మని ♦ బదరీ ఫలములు
అనటుల సంతతు ♦ లట దానిమ్మలు
ఖర్జూరంబులు ♦ కమలఫలంబులు
గొజ్జంగులు సిత ♦ కుముదసంతతులు
నారంగంబులు ♦ నన గజనిమ్మలు
మారేడులు మరి ♦ మల్లెలు మొల్లలు
తములపు తీగెలు ♦ తరుచగు నిమ్మలు
రమణీయంబుగ ♦ రాజిలు తరువులు
పిందెలు పూవులు ♦ బెంపుఫలంబులు

గ్రిందు గొలుపు క ♦ స్తవకు పసందులు
కిలకిలలాడెడి ♦ కీరభాషణలు
కలకలఁబల్కు పి ♦ కాలాపంబులు
గోరంకులు మృదు ♦ కూజితములు పలు
పారావతముల ♦ పలుకుబలుకులు
తమ్మి తేనియల ♦ ద్రావిన తేటులు
జుమ్మని చేసెడి ♦ సొగసగు రుతములు
పట్టణమంతయు ♦ పర్విన మ్రాకులు
దట్టపునీడల ♦ దనరిన తావులు
చల్లదనంబుల ♦ సౌరభ్యంబులు
నల్లమిగుర్పగ ♦ నుత్సాహంబులు.

ఆహా! యెందుజూచినను కలంకము లేకుండుటచేతనే లంకాపట్టణమని ఖ్యాతిగాంచినది. పురదర్శనలాలసుండనై మైమరచి రామకార్యము నారయక చరించుచుంటినే? ఏమి నాబుద్ధిమాంద్యము? ఈసౌధము లంకెచ్చట నుండునో రాము దేవేరిని దర్శించెద. (అని వెదకుచు) ఆహా! యీసౌధరాజమేమి? (వినుచు) ఆఁ యేమీ! ఇంద్రజిత్తునియా చెలికత్తె బల్కునది. (చూచి) ఇచట సీతలేదు. ఇంకొకయింట జూచెద. (వినుచు) యేమీ! అక్షయకుమారుడనియా సేవకుడుబల్కుట. (చూచి) ఇందును జానకిజాడ కాన్పించదయ్యె. ఆయంగణము చూచెద.

(చూచి) రామ, రామ, రామ, నేడెంత పాపకార్యమొనర్చితిని.

చ॥ కటకట బ్రహ్మచారినయి ♦ కన్నులఁజూడఁగ రానికార్యముల్
తెటుకున గాంచఁగావలసె ♦ దామరసాక్షుల గాత్రమర్మముల్
పటుతరలీల నానొసట ♦ పద్మజు డిట్టుల వ్రాసె నక్కటా
దిటమగు నాదుపాపముల ♦ ద్రెంపగజేయుట రామనామమే!

తయింట నెవ్వరో మాటలాడుచున్నారు. పోయి చూచెద. (చూచి) ఔరౌర! పచ్చిమాంసమును దిని సారాయిని ద్రావుచు మత్తుచే గలహించుచుండిరి. ఏమీ వీరల దుండగము! (విచారముతో) అయ్యో! రామచంద్రా!

(౮౬ అనుబంధము.)

చ॥ తిరిగితి సంగణంబులను ♦ దిమ్మరితి న్వడి వీధులన్ని యా
యలగఁగ మండపంబులను ♦ కాంతలసౌధము లెల్ల జూచితి

పురమున గోపురంబులను ♦ పొల్పగు మేడల నెల్లగాంచితిం
హరిహరి! గాంచనైతి జన ♦ కాత్మజ నెందును నేమిసేయుదుం॥

అయ్యో దైవమా! నేటికి రెండుదినములనుండి పట్టణమంతయు గలయం దిరిగినను రాముదేవేరిని గాంచనోచనైతినిగదా! హా! రామా! ఇక రావణుని యంతిపురంబునకుం జని చూచెదగాక!

(37 అనుబంధము.) (అని నిష్క్రమించును.)

---

ద్వితీయరంగము—రావణుని యంతిపురము.

(రావణుడు, మండోదరి శయనించి యుందురు.)

ఆంజ—(ప్రవేశించి) ఆహా! శ్రీరాముదేవేరియగు జానకిని నిసాధయున గాంచితిని గదా! నేనిక ధన్యుడ. (మరలజూచి) అ! యేమి నాబుద్ధిమాంద్యము! నిశ్చయముగా రాముదేవేరియే యైన,

గీ॥ రావణుని సెజ్జపై నిట్లు ♦ రామరామ!
సంతసంబున నుండునా ♦ సత్యశీల?
(చూచి) కాదు కన్గొన రావణు ♦ కాంతగాని
జానకీదేవి గాదు సం ♦ శయ మికేల?

అది నిశ్చయముగా రావణుని భార్యయగు మండోదరియే. (ప్రకాశ) అయ్యో! పరమపతివ్రతామతల్లియగు సీతామహాసాధ్విపై నెట్టి బెట్టిదంపు వాక్యములు బల్కితిని. శ్రీరామ! రామ! రామ! ఎంతపాపమతిని! నా పాపము రామనామమే పావనము సేయుగాక! (వినుటనభినయించి) వీరేదో ప్రసంగించుచున్నారు. వినియెద. (అని ఒకవైపునను౦డును.)

మండో—నాథా! నేడొక విపరీతపుకల గంటిని. ఒకానొక మర్కటుడు మన లంక నంతయు గాల్చినట్లును, అశోకవనమును గూల్చినట్లును, సీతామహాదేవితో ప్రసంగించినట్లును, కలంగంటిని. సీతాదేవిని దెచ్చి మన లంకయందుంచినది మొదలు నామానసమేలకో అల్లకల్లోలమగుచుండెను. మీ కనేకవేల స్త్రీలుండ మనుజాంగనయగు సీతయేల? మాకన్న సౌందర్యవతియా? దేవా! సీతను రామున కిడితివేని మనకు జయముగల్గును. నామనవి వినుడు.

రావ—ఓసీ పిరికిదానా! కోతీ గీతీ నన్నేమిసేయును?

మండో—నాథా! కోతియేగాదు,వాల్మీకిచేవ్రాయబడిన రామాయణమందుసైతము కోతులచే నీలంక నాశనమగునని వ్రాసియున్నది. మీరు గాంచలేదా?

ఆంజ—ఈమె కోతియనుచున్నది. నారూపము కనుపించుచున్నదాయేమి?

(34 అనుబంధము.)

రావ—ఈపిచ్చివ్రాతలకేమి! రామాయణమును దానిరచించిన వాల్మీకిని చుట్ట జుట్టి గిరగిరద్రిప్పి సముద్రమున బారవైచెద. ఇక మాటలాడకుండుము. నా ప్రతాపమంతయు నెరిగియుండియు నేమియు నెరుఁగని పిచ్చిదానివలెఁ బల్కెదవేమి? ఇక మిన్నకుండుము. నే నశోకవనమునకుం జని సీత నను గోరునట్లు చేసెద.

మండో—నాథా! నామనవి చిత్తగించుము. అశోకవనమందుగల సీతచెంత కేగితిరేని మనకు తప్పక కీడుచేకూరును. కాన మీరు పోవలదు. ఆ రూపవిహీను రాలితో నేమిపని?

ఆంజ—(తనలో) సీతామహాసాధ్వి యశోకవనమందుండెనని వీరు ప్రసంగించు చున్నారు. ఇక నేనశోకవనమున కేగెద. ఇంక వీరేమి ప్రసంగించెదరో చూచెద.

రావ—దేవీ! పురుషుడు పరస్త్రీని మోహించిన కులకాంతలు వద్దనియు, కూడద నియు, చేటనియు, గీటనియు, పెద్దమ్మరయనియు ననేకవిధములఁ బల్కెదరు. ఇంక నీ వేదాంతములు గట్టిపెట్టి మాటాడకుము.

ఆంజ—(తనలో) మూర్ఖుడగు వీనికి పతివ్రతోపదేశము లహితమాయెనే!

రావ—నేనిదేపోయి సీతనువరించెద. అందుల కాపె యంగీకరింపకున్న బలాత్క రించెద. (అని లేచును.)

ఆంజ—(తనలో) వీనికి కాల మాసన్నమయినది.

మండో—నాథా! మీరు పోవలదు. (అని పట్టుకొనును) (39 అనుబంధము.)

రావ—నన్ను విడువుము. నేను పోకమానను.

ఆంజ—(తనలో) నీవుపోయిన చావకమానవు.

రావ—సఖి! సుఖముగా నంతిపురమున నుండుము. పొమ్ము. (నిష్క్రమించును.)

మండో—హా! యిదియొక వెఱ్ఱి.

సీ॥ వినడాయె నానుడి ♦ కనడాయెఁ గన్గవ
మనడాయెనేలొకో ♦ మనముగుదిరి
వలదంచు నేపల్కఁ ♦ గలవాణియని సీతఁ
దిలకించబోయెనే ♦ దలఁపకుఁడ
హితవాక్యముల వీడి ♦ యతనుకోలకు నోడి
వెతలందుటకు నాయె ♦ వెడగుబుద్ధి
కాదంచు నీకిది ♦ వాదించి యిది పాడి
గాదంచు బోధించు ♦ ఘనులు లేరె

గీ॥ చాల మారుని బారికి ♦ పాలుమాలి
గోలసీతను గన్గొని ♦ జేలకీతి
సోలు నానాథుమదిని గ ♦ గ్గోలు పెట్టి
మేలు నాకొనరింప రీ ♦ కాలమునను॥ (నిష్క్రమించును.)

ఆంజ—వీనికన్న ముందర నశోకవనము ప్రవేశించి వీనిచేష్టలు చూచుచుండెద. మేరమీరినయెడల రాముని చే నొనరింపబడు కార్యమునకు నేనే సాహసించెద. (అందరు నిష్క్రమింతురు.) (తెరవసిక రుజాను.)

---

తృతీయరంగము— అశోకవనము.

(విషాదముతో సీత, వికారరూపముతో రాక్షసాంగనలు ప్రవేశింతురు.)

సీత—అయ్యో దైవమా! (40 అనుబంధము.)

చ॥ పుడమికి బుట్టియుఙ్ జనక ♦ భూపుని యింటను బెంపునొంది యీ
పుడమిని సూర్యవంశమున ♦ పూజ్యతనొందిన రామమూర్తికిఙ్
బడతుకనయ్యు నే నకల ♦ భాగ్యములందియు నక్కటక్కటా
యడరుచు రాక్షసాధముని ♦ యాజ్ఞను గుందగనాయె దైవమా!

ఉ॥ తప్పని యెంచకేను మును ♦ దంపతులఙ్ బెడంబాసి యుంటినో
తిప్పలుగల్గె నాకిపుడు ♦ దీనదయాపర! రామచంద్ర! నా
తప్పును సైచు లక్ష్మణుఁడ! ♦ దాగునెకర్గము లెల్లకాలముఙ్
నెప్పుడొరంగె జీవములు ♦ నే నొనరించిన నోము లేమగుఙ్?

గీ॥ పరగ లక్ష్మణు దిట్టిన ♦ ఫలము నేడు
గంటి నానాథునింబాయు ♦ గంటినకట
యసురకాంతల దుష్టవా ♦ క్యములనెల్ల
వినుచునుంటిని మొండినై ♦ మనుచునుంటి॥

అయ్యో దైవమా! నా దేహ మర్థాంగమగుటచే జచ్చుటకైన స్వాతంత్ర్యమొసంగవైతివే! నావంటి దురదృష్టురాలు బ్రతికి పుట్టినింటికి మెట్టినింటికి నపయశము దెచ్చుచుండ జంపక చూచుచుండ నీకు తగునా? (చూచి) హా దైవమా! దన బాధముండఁగ రావణుండు మరల నిటే వచ్చుచున్నాడు. ఎటువంటిపల్కులఁ బల్కి నన్ను బాధింప నున్నవాఁడో కదా! హా! నాథా! సతుర్థాంగి కెట్టి యాపద చేకూరినది? (అని శోలవంచుకొనును.) (41 అనుబంధము.)

(రావణుడు ప్రవేశము.) (42 అనుబంధము.)

రావ—ఆహా! యేమి దీనిసోయగము! త్రిజగన్మోహిని యన దీనికే తగును.

(ప్రికా) సీతా! యేటికిట్లు నిద్రాహారములుమాని కుంది కృశించెదవు? ఇదిగో యిటువినుము.

సీ॥ ప్రియమైన ఘనమైన ♦ పీతాంబరములుండఁ
గడు మైలపుట్టముల్ ♦ గట్టనేల
కస్తూరి చందన ♦ ఘనసారములుగల్గ
పృథ్వీధూళిని నీవు ♦ బృంగనేల
షడ్రసోపేతాన్న ♦ సారంబులుంగల్గ
నుపవాసములు జేసి ♦ యుండనేల
విరియు పూగుత్తుల ♦ గురుసెజ్జలవిగల్గ
కటికినేలనుబండి ♦ కుందనేల
గీ॥ విజయలక్ష్మికి విభుఁడనై ♦ వెలయుచుండ
నన్నుగోరక నీవింక ♦ నరునిఁగోరి
కందమూలంబులను దిని ♦ కానలోన
గష్టమేలను గడిపెదా ♦ కలికిమిన్న॥

ఓసీ! వెఱ్ఱిదానా! నరాధముండగు రాముని గోరుటచే నీకిట్టియిక్కట్టులు సంభవించినవి. నీ నాథుం డెంతదుష్టుఁడుకానిదే కన్నతండ్రి కానలకంపునా? ఇప్పటికైనను తెలివిఁదెచ్చుకొని దుష్టుఁడగు నీపతిమాట దలంపక నాయంతిపురంబునకు రమ్ము.

సీత—(గడ్డిపోచ చేతబట్టుకొని దానిఁజూచుచు) ఓరీ రావణా! యేల నీవిట్టిదుర్భాషలాడెదవు? నీకు జీవములపై నిచ్ఛయున్నచో నిప్పుడు,

చ॥ వినయముమీర నన్ను రఘు ♦ వీరునకిచ్చియు కేల్మొగిడ్చినఁ
గని నిను వేగ నెమ్మదిని ♦ గౌరవమొప్పగ గాచుఁబ్రోచురా
వినుము మదీయవాక్యముల ♦ వీరుడనంచని విఱ్ఱవీగ నీ
జనములు పుత్రమిత్రులిట ♦ జచ్చుటనిక్కము రాక్షసాధమా!

ఓరీ రాక్షసా! నీకు జీవితముపై నిచ్ఛయున్న, నన్ను రామునకర్పించి శరణాగతవత్సలుఁడగు రఘువీరుని మన్ననలకులోనగుము. లేకున్న నీకింక పుడమిపై బ్రాణంబులుండవు. నామాటవినుము.

(43 అనుబంధము.)

రావ—ఎంతదానివే! స్త్రీహత్య పాపమని శాంతివహించ మేరమీరి బల్కుచుంటివా? మానవాధముడగు రామునకు నిన్నొసంగుటకాక నమస్కారముకూడ జేయువలయుగా! తొందరొందకుము. నిన్నిచ్చి నమస్కారము జేసెదనులే.

సీత—ఓరీ! క్రూరుడగు నీకు బరమపతివ్రతలతో బలుక నధికారములేదు. కాన నీవింక బొమ్ము. (అని తలవంచుకొనును)

రావ—ఇది వినయోక్తులతో లోబడునటులేదు. (అని రాక్షసాంగనలజూచి) యేకజటా! హావిర్జటా! యేమిచేయుచుంటిరి?

ఏక—రాక్షసేశ్వరా! తమసెలవున కెదురుచూచుచున్నాము.

రావ—రాక్షసాంగనలారా! సీతను రెండునెలలలోపల నాకెట్లయినను స్వాధీనముజేయుడు. అట్లుగానిచో మీకరవాలములచే ఖండించి వండికొని దండిగా తిండి తినుడు. నే నిదే పోయెద. ఈకార్య మెట్లు నెరవేర్చెదరో!

హావి—చిత్తము. రాక్షసేశ్వరా ఇదెంతపని!

రావ—మంచిది. (నిష్క్రమించును.)

హావి—ఓసీ సీతా! మా రాజరాజేశ్వరుడగు రావణుని వరించుము. లేకున్న నా కత్తిచే ఖండించెదను. మాటాడవేమి? (అని కత్తిదిప్పును)

సీత—రామరామ! యెట్టికర్ణకఠోరము లాలించవలసివచ్చెను!

ఏక—ఓసీ సీతా! ఇంద్రునికన్న మించినభాగ్యముకల మారాజును వరించుము. లేకున్న నిన్ను బ్రతుకనిచ్చుటలేదు. (అనికత్తిదిప్పుచు) మారుపల్కవేమి?

(44 అనుబంధము.)

త్రిజట—(నిద్రలేచి) ఓరాక్షసాంగనలారా! శాంతింపుడు. రాక్షసకులనాశము సమీపించినది. ఏలయిట్లు వదరెదరు... (45 అనుబంధము.)

ఏక—సీతా! మాటిమాటికి లామలామయనుట మానుము. ఇకమీద రెండు మాసములు గడువిచ్చితిని. గడువులోపల మారాజును వరించుము. లేకున్న నిన్ను ఖండించుట సత్యము నమ్ముము.

త్రిజట—ఓసీ ఏకజటా! యేమే యిట్లువదరెదవు? సీతారాములమహిమ వినుము. రాములవారు తమ్మునితోడ పుష్పకవిమానారూఢుడై అయోధ్యాపురంబున కేగినట్టును, రావణుడు మేనెల్ల రక్తమలందికొనినట్లును, నల్లని వస్త్రములు ధరించినట్లును, తైలపానము చేసినట్లును, కలగంటినిగావున నింక శ్రీరామ జయంబును, రావణునాశంబును గాగలదు. నీమహాసాధ్విని నింక నేమియు ననక నుపచారము సేయుడు. లేకున్న మనకు గతులు లేవు.

హావి—ఏమో నీవేచేయుము. మాకు నిద్రవచ్చుచున్నది. (నిద్రింతురు.)

త్రిజ—అమ్మా! సీతా! ఊరడిల్లు మూరడిల్లుము.

ఆంజ—ఈమండ ఇంకను మేలుకొనియుండినదే! నేనెట్లు దేవితో మాట్లాడుదును? తెల్లవారవచ్చుచున్నదే!

సీత—అమ్మా త్రిజటా! యీ నిర్భాగ్యురాలి కింతటి భాగ్యమొదవునా? ఇంక నాకు మరణమే శరణము. (కండ్లు మూసికొనును.)

త్రిజ—అమ్మా! దుఃఖించకుము. నీకు శుభమే చేకూరు. ఆహా! నిద్రవచ్చుచున్నది. (పరుండును.)

సీత—(మెడకు ఉరిబోసికొన యత్నించును.)

ఆంజ—అయ్యో! సీత చావున కుంకించుచున్నది. అమ్మా జానకీ! నీ నాథుండు సోదరసహితంబుగా ఋశ్యమూకాద్రిపై సుఖమైయుండె. నీవు ప్రాణత్యాగము జేసికొనవలదు.

సీత—(తనలో) ఆఁ యేమది కలయా? నిక్కమా? కోతిని స్వప్నమందుగన్న యశుభమని పెద్దలు బల్కుదురు. రామ రామ రామ రామ. ఓరీ రాక్షసాధమా! దొంగవై నన్ను గొనివచ్చినది చాలక కోతిరూపమున నన్నలయింప వచ్చితివా? ఓరీ నీచా!

ఆంజ—అమ్మా నేను రాక్షసుఁడనుకాను. నిక్కముగ నమ్ముము. నేను రామదూతను తల్లీ! నీసేమ మారయుటకై నన్ను రాముఁడుబంపియుండె. నిక్కముగా నేను శ్రీరామదూతనుగాని రాక్షసుఁడను గాను.

సీత—ఓరీ! నిక్కముగా నీవు రామదూతవేయైన రాముని రూపలావణ్యములు వర్ణించితివేని నమ్మెద.

ఆంజ—అమ్మణ్ణీ! మహాప్రసాదము. చిత్తగించుము.

సీ॥ నీలములమించు కాంతులు ♦ నిగ్గుదేరు
మేనికాంతులు గల్గు న ♦ మేయయశుడు
దీనజనబాంధవుండు సు ♦ ధీయుతుండు
భూరిభుజవిక్రముండు రా ♦ ముండు తల్లి॥

అమ్మా; వానరుఁ డనగు నేను వారిని వర్ణించ నెంతవాడను; మరియు రూపమునందును, గుణమునందును, శౌర్యమునందును, రామునకు వెనుదీయడు రామానుజుండగు లక్ష్మణుండు. అమ్మా! నిక్కముగా నే నీదాసుడ, నమ్ముము. (అని నమస్కరించును) తల్లీ! నీ నిజేశుండు సకల గుణాభిరాముం డగు శ్రీరాముండు. నీ కానవాలొసంగిన ముద్రిక యిదిగో గ్రహించుము. (అని ముద్రికనిచ్చును.)

సీత—(తీసికొని) అయ్యో రామరత్నమా! ఎన్నాళ్లకు నిన్ను గంటిని. ఓ యంగుళీయకమా!

శా॥ కారుణ్యంబున రామచంద్రునకు న ♦ స్కల్యాణముల్ జేసి నీ
కీర్తిన్ బెడబాసి మమ్ములను నీ ♦ వెట్లుంటి విన్నాళ్లు హా!

పారంబింతయు లేని ప్రేమమున నా ♦ ప్రాణేశు నన్గూర్పగా
జేరఁగ వచ్చితి వంతెచాలు నిను నే ♦ జేకొందునో రత్నమా!

ఓ రామరాజభూషణమా! దేశాంతరమున నున్న నన్నును నానాథుని గూర్పవచ్చితివా? నాయనా! కేసరీపుత్రా! నీవు కేసరిపుత్రుఁడవను సార్థక నామము నిలుపుకొంటివి. అయ్యా! నాకు రాముని క్షేమము దెల్పి నా ప్రాణములనిల్పి పుణ్యము గట్టుకొంటివి. నీ వొక్కఁడవంతున లంక ప్రవేశించి యంతయు దిమ్మరితివి. ఇట్టి ధైర్యసాహసములుగల నీకు నీయధమ దానవులచే భీతి లేదు. ఇకమీద నిశ్చలస్వాంతుఁడవై యుండుము. అయ్యా! నన్నెప్పుడు రాముడు సాకేతపురి జేర్చును?

ఆంజ—అమ్మా! నీకొరకు శ్రీరాముఁడు అన్నపానీయంబులు విసర్జించి మిగుల గుందుచున్నవాఁడు. తల్లీ! మీక్షేమవార్తలెరిఁగినతోడనే, నాకన్న మిన్నలగు ప్లవంగేశ్వరులగూడి రాక్షసకులనాశనంబొనర్చి కొలఁదికాలములో నిన్ను సాకేతపురము జేర్చగలడు. చింతింపకుము. తల్లీ! నీవిచ్చట నిలువలేనిచో నాభుజములపై గూర్చుండుము. నిమిషమాత్రములో శ్రీరాముని చెంత జేర్చెదను.

(46 అనుబంధము.)

సీత—అయ్యా! నీవంతటి సాహసుండవేగాని వట్టిపిరికిదాన. అంతటికార్యమునకు నేను సాహసింపఁజాల. నీవుమార్గమధ్యమున రక్కసులలో బోరాడు నప్పుడు భీతిల్లి క్రిందపడిపోయెద, గావున నన్ను క్షమింపుము. మరియు నీవు నన్నిప్పుడు గొనిపోయిన యిదంతయు దొంగతనముగా నుండును.

ఆంజ—చిత్తము మీ యిష్టము. అమ్మా! నే నిట్లనే యుండువాఁడనుగాను నానిజరూపమును జూడుము. (అని విశ్వరూపము జూపించుచున్నాడు.)

సీత—అయ్యా! యింక నీభీకరాకృతిని జూడఁజాలను. శాంతినొందుము, శాంతి నొందుము.

ఆంజ—అమ్మణ్ణీ! నేను,

గీ॥ తడయరాదింక శ్రీరామ ♦ ధరణిపతికి
నిచటి జాడలు దెల్ప నే ♦ నేగవలయు
రాఘవులు నమ్మ నేదైన ♦ రమణియొకటి
యానవాలిమ్ము సెలవిమ్ము ♦ నేనుబోదు॥

సీత—అంజనీపుత్రా! యిదిగో! యీరత్నమునుగొని, నానాథునకిడి నా యీవిన్నపమును విన్నవింపుము.

సీ॥ పాషాణమును దొల్లి ♦ పడఁతిగాఁ జేసిన
పాదంబులకు నింకఁ ♦ బ్రణుతులనుము
తారకమంత్రమై ♦ ధరణి శెంపొందుమీ
రామనామము నమ్మి ♦ రమణీయనుము
మితిమీరిపల్కిన ♦ మతిలేనివదినెను
క్షమియించుమనుచు ల ♦ క్ష్మణునకనుము
మాసమ్ములో లంక ♦ మసియొనర్పకయున్న
సత్యము జానకి ♦ చచ్చుననుము
గీ॥ అన్నమును నిద్ర విడనాడి ♦ యున్నదనుము
మిమ్ము హృత్పద్మముల జాల ♦ నమ్మెననుము
దిక్కెవ్వరు లంకలో ♦ మొక్కెననుము
ఆంజనీపుత్ర! సీత యి ♦ ట్లాడెననుము॥
మిగులఁ జింతింపుచు నిట్లుగా నుడివినదని విన్నవింపుము.

ఆంజ—చిత్తముతల్లీ! పోయివచ్చెద. సెలవొసంగుము. (పోవుచు) నేనీలంకాపట్టణమునకు వచ్చి రిత్తగాపోవుట శూరుఁడనగు నాకు తగవుగాదు కావున కొన్ని ఫలంబులఁ దిని యీవనమెల్ల నల్లకల్లోలము జేసిపోయెద.

(అని నిష్క్రమించును.) (యవనిక పడును.)

---

(తురీయ రంగము—అక్షయుఁడు, ఇద్దరుజెట్టు, మరికొందరు రాక్షసులు ప్రవేశము)

అక్ష—ఓరీకోతి! నందన వనమెల్ల నాశము సేయు టొకపౌరుషముగాదు. నన్ను గెల్చి ప్రాణములు నిల్పుకొనుము.

ఆంజ—ఓరీ పిరికిరాక్షసా! నిన్నీవాలమునఁజుట్టి జలధిలోఁ బారవైచెదఁజూడుము.

అక్ష—ఓరీ! (47 అనుబంధము)

గీ॥ మేరమీరి యిటుల్ పల్క ♦ తీరుగాదు
కదనమందున నిల్వుమీ ♦ కదలకుండ
మట్టుబెట్టెద నిన్నింక ♦ మిట్టిపడకు
కొండ యనుకోర నల్లని ♦ పండుకోతి॥

(అనిబాణము వేయును)

ఆంజ—

ఉ॥ చాలునుచాలు నాపుమిక ♦ చప్పనితూపుల గాంచినాడ నా
వాలముతోడ మొత్తెద న ♦ వారితశూరత మోప్రిలనిల్వుమీ
బాలుఁడటంచు నెంచి మదిఁ ♦ బాపమటంచని పేర్మిమజూపనీ
కాలమువచ్చి పిల్వఁగను ♦ గాలునిచెంతకు బోకయుందువే॥

ఓరీ! అక్షయుడా! ఈదెబ్బతో నీవుచెల్లు. (అని వాలముతో కొట్టును.)
(అక్షయుడు క్రిందపడును.)

ఇంద్రి—ఓరీ! మాయకోతీ! బాలుఁడగు అక్షయకుమారుని జంపుటయా నీగండతనము? సన్నడతేర్చి మరిపొమ్ము.

ఆంజ—ఓరీ! నీసోదరునిగతి యేమయ్యెను? నీవును అంతియే, రమ్ము.

ఇంద్రి—ఓరీ! బ్రహ్మాస్త్రముచే నిన్ను గట్టివైచెద జూడుము.

ఆంజ—అటులనా? రానిమ్ము. (48 అనుబంధము.)

ఇంద్రి—(బ్రహ్మాస్త్రము వేయును.)

ఆంజ—రామ! రామ! రామ! (అని క్రిందబడును. ఇంద్రజిత్తు హనుమంతుని రెక్కలు గట్టును.) (యవనికపడును.)

---

పంచమరంగము - రావణునిసభాస్థానము.

(విభీషణుఁడు, రావణుఁడు, రెక్కలుకట్టిన హనుమంతుఁడు ప్రవేశము)

ఆంజ—(తనలో) తొల్లి బ్రహ్మదేవుఁడు నీవు బ్రహ్మాస్త్రముచే నేడుగడియలు గట్టబడియుందువు. పిమ్మట నిన్నది వీడునని వరమిచ్చియున్నాఁడు; కావున నట్లనే కాగలదు. ఇంతలో రావణాసురునితో బ్రసంగించెద.

రావ—తనయా! అక్షయకుమారుని జంపినకోతి యిదియేనా? ఓరీ వనచరాధమా! నీ విక్కడికేలవచ్చితివి? నిన్నెవ్వరుబంపిరి? సత్వరముగా జెప్పుము. లేకున్న నిన్ను శిక్షించెద.

ఆంజ—ఓరీ! నేను వాయుపుత్రుండ. రామదూతను. సీతాదేవిని వెదుకవచ్చితిని. మరియు నిన్ను జూడదలంచియు, నీతో ముచ్చటించదలంచియు, నీతనయుని బ్రహ్మాస్త్రముచే బద్ధుండనై యిటువచ్చితిని. అది యటుండనిమ్ము. నన్ను బంపినది రాముఁడు. ఆరాముని ప్రతాపము దెల్పెద వినుము.

ఉ॥ శంకరుచాపము న్విరిచి ♦ సాహసు భార్గవు నోటువుచ్చె నీ
జంకక పాశబద్ధునిగ ♦ సల్పిన వానిని కోలగూల్చినా
డింకను రాక్షసాధముల ♦ నెందరినో దునుమాడె, నౌర నీ
వంకకు నన్నుబుచ్చె నిక ♦ వారిపరాక్రమ మేమిచెప్పుదున్॥

ఓరీ రావణా! నా ప్రతాపము వినుము.

ఉ॥ తోటలు ద్రుంచివైచితిని ♦ త్రొక్కితిఁ గుద్యములన్ని నుగ్గుగా
మేటియటన్న నీసుతుని ♦ మేపముఁలోపలఁ జంపివైచితిఁ
ధాటిగ నీదుమస్త్రకవి ♦ తానముఁ దన్నగనెంచియుంటి మో
మోటమి నుంతలేదు మరి ♦ యూరక వాగకురోరి రావణా॥

(అని తన్నబోవును. రాక్షసులు బట్టుకొందురు.)

రావ—ఓరీ గర్వపోతా! దూతవగు నీకెంత యధికారముకలదో యట్లుండకి మేర మీరుచుంటివి! నిన్నిప్పుడే ఖండించెదను చూడుము. (అనికత్తి యెత్తును.)

విభీ—(అడ్డమువచ్చి) అన్నయ్యా! శాంతమూనుము. నేతనువిడి దూతనుజంపుటచే లోకులు మిగుల దూషించెదరు. కావున యీ దూతకు బుద్ధివచ్చున ట్లొక ముద్రవైచి పంపుడు!

రావ—అట్లయిన వీనితోకకు తైలములోముంచిన గుడ్డలుచుట్టి అగ్గిముట్టించి పంపుడు. సీతకొరకైవచ్చినకోతికి వాత యిదియని లోకులుమెత్తురు.

విభీ—మంచిది. అట్లనే చేసెదము. (అందరునిష్క్రమింతురు.)

---

ఆంజ—(లంకతగులబెట్టి పునఃప్రవేశము) ఇప్పటికి లంకాదహనమహోత్సవం బైనది. లోకమాతయగుసీతను మరల దర్శించి సెలవుగోరి పయనమై పోయెద.

(నిష్క్రమించును.) (యవనిక పడును.)

పంచమాంకము-సంపూర్ణము.





శ్రీ

# సంపూర్ణ రామాయణము



## షష్ఠాంకము

### ప్రథమరంగము—బయలుప్రదేశము

(రామ, లక్ష్మణ, సుగ్రీవాంగద, హనుమంత, జాంబవంతాది వానరులు ప్రవేశము.)

రాము—అయ్యా! సూర్యసూతీ! ఇక జాగుసేయక లంకాపురిజేర సకలవానర సైన్యంబుల సమకూర్చుము.

సుగ్రీ—చిత్తము.

అంగ—అయ్యా! రఘునందనా! రావణునిగర్వాంధకార మున్నకొలది హెచ్చుచున్నది. వానిని సంహరించ సత్వరమ సెలవొసంగుడు.

సుగ్రీ—కుమారా! అంగదా! యింక జాగుసేయక సైన్యంబుల సమకూర్చుము.

అంగ—చిత్తము. (అని నిష్క్రమించును)

లక్ష్మ—అన్నయ్యా! మిట్టిపడుచున్న రావణాధము నొక్కకోలనే గూలనేసెద. నాప్రతాపముఁ జూడుము.

రామ—లక్ష్మణా! శాంతించుము. లంకాపురిప్రవేశమైనపిమ్మట కర్తవ్య మాచరింతము. ప్లవంగేశ్వరులారా! స్వామికార్యము నెరవేర్ప ప్రయత్నించుడు.

సుగ్రీ—చిత్తము.

(అంత విభీషణుండు ప్రవేశము.)

విభీ—శరణాగతవత్సలా! రామచంద్రా! శరణు! శరణు!!

రాము—ఓయీ! భయపడకు. రక్షించెద. నీవృత్తాంతమంతయు జెప్పుము.

విభీ—అయ్యా! అర్కకులాధినాథా! చిత్తగింపుడు. నేను లంకాపురాధీశుఁడగు రావణాసురుని సోదరుఁడ. విభీషణుఁడనువాఁడ. లోకమాతయగు సీతను శ్రీరాముల కొసఁగుమని నీతులుదెల్ప మాయన్న రావణుఁ డవి యవినీతులుగాదలఁచి నన్ను పరిభవించి లంకయందు నుండనీయక పారదోలె. దేవా!

యీయనాథయగు విభీషణుఁడు గావవేఁడుచున్నాడు. (అని పాదములు పట్టుకొనును.)

లక్ష్మ—అన్నయ్యా! చూచితివే వీనిమాయ? మనమిట్టిమాయ లెన్నిచూచి నారము! వీఁడు మనకు మసిబూయదలచి వచ్చి శరణు శరణనుచున్నాడు. కాన వీనికి శరణ మొసఁగరాదు. నా మనవి నాలింపుడు. తమసెలవైన ఖండించెద.

రాము—సోదరా! లక్ష్మణా!

ఉ॥ స్వామి! భరింపుమీ శరణు ♦ పాహియటన్నను గాచునట్టి నా
నేమము వీడఁజాల గడు ♦ నిందల పాలగునట్టి కార్యముల్
నామది జేరనీను నను ♦ నమ్మిన రక్షణ మబ్బు, గానిచో
రాముఁ డధర్ముఁడం చనరె ♦ రాజులు కీర్తి నడింపదే భువిన్॥

తమ్ముడా! ముందుగా రక్షించెదనని పల్కితిఁగాన వీని విడిచితినేని లోకుల కొకయవనీతి నేర్పినవాఁడనగుదును. ఎద్దియున, తొల్లి రక్షించెద నని రాముఁడే నీతిదప్పెఁగాన మనమెంతటివారమని లోకులెల్లరు నన్ను దలంచుచు ననాచారకార్యములనే యవలంబించెదరు. అట్టి యధర్మము నకును యనృతమునకును నేను సహించజాల. ఇతడు పరమభక్తుడు. ఈతని వీడజాల. (అని విభీషణునిపై జేయివైచును.)

విభీ—అయ్యాలక్ష్మణా! మన్నింపుడు. రావణాసురుఁడు సురాసురలచేఁ జావు లేకుండ వరప్రసాదము బడసెనుగాని నరునిచేఁ జావులేకుండ గోరలేదు. వాని జంపు నుపాయమును లంకయందుండు రహస్యములను వెలిబుచ్చెద. నన్నను గ్రహింపుడు.

రాము—మంచిది. విభీషణా! అట్లయిన నిన్ను లంకకు రాజ్యాభిషిక్తునిగా జేసెద. ఇంక స్వామికార్యము నిర్వర్తింపుము.

సుగ్రీ—అయ్యా! రఘుకులనందనా! విభీషణుని లంకకు రాజ్యాభిషిక్తుని జేసె దమని నుడివియుంటిరి. ఒకవేళ రావణాసురుఁడు మిమ్ముల శరణుజొచ్చిన నేమిచేసెదరు?

రాము—సూర్యసూతీ! అట్లయినచో నాప్రతిన నెరవేర్చుకొన లంకకు విభీషణునిరాజు గా నియమించి రావణాసురునకు నారాజ్యమగు నయోధ్యనంతయు నిచ్చెద.

సుగ్రీ—చిత్తము.

రాము—విభీషణా! లంకకు జేరు నుపాయ మాలోచింపుడు. ఇంక జాగుసేయదగదు.

విభీ—చిత్తము.అట్లనేచేసెద. అయ్యా! సుగ్రీవా! రండు. సేనలఁగూర్చుకొనిపోదము.

(అందరు నిష్క్రమింతురు.) (యవనిక పడును.)

---

ద్వితీయరంగము - యుద్ధభూమి.

(ఇంద్రజిత్తు పడియుండును. రావణుడువిషాదముతో)

రావ — హా! తండ్రీ! అనేక మాయలుసేసి, యెందరెందరినో దునిమి కీర్తిగాంచి నేటి కీనరాధమునిచే యస్తమించితివా!

ఉ॥ హా! యసురాగ్రగణ్య యమ ♦ రాధిప బాహుబలాపహార! హా!
హా! యువరాజ! లోకజిత ♦ హా! సుగుణోన్నత వంశదీపకా
హా! యిట బుష్పశయ్యాధర ♦ యుద్యోగదా పెదనిద్ర పోవగా
నాయన! మమ్మువీడిచన ♦ నాయను నన్గనులెత్తి చూడరా॥

అయ్యో! రావణవంశాంకురమా! నీకెట్టిగతి చేకూరినది? తండ్రీ! నీవు లేనియెడ నా కీలంకాపట్టణ మేల? ఈ రథ గజ తురగాదివాహనంబు లేల? హా! తండ్రీ నీవులేమిచే లోకమెల్ల సంధకారబంధురమైనది. (మోముజూచి) హా! కుమారా! మేఘనాథ! యింద్రాదిదిక్పాలురసొంపుదూలించి, చెరల బెట్టి జగములనెల్ల బెగడుపరచి యనేకమాయలుపన్ని పగతుర దెగటార్చి కీర్తిగాంచి, నేడీనరాధముని శితశరప్రకరంబులకు లోనై కీర్తిశేషుడవైతివా? హా! తండ్రీ! యిక నే మనజాల. (కోపముతో) ఓరోరి నరాధమా! కదన మందు నీ రూపుమాప రావణుండిదే వచ్చుచున్నాడు. తొందరనొందకుము. (అని లేచిపోవును.) (యవనికపడును.)

తృతీయరంగము - యుద్ధభూమియం దొకపార్శ్వము.

(లక్ష్మణుడు మూర్ఛపడియుండును.)

(రాముడు విచారముతో) (4) అనుబంధము.)

రాము — హా! లక్ష్మణా! సౌమిత్రీ! ఊర్మిళామనోహరా!

సీ॥ సవతులందున జన్మ ♦ మవుటయె, పీఠొక్క
యంబ కేబిడ్డలో ♦ యనగ బ్రజలు
ఒక్కపళ్లెరమున ♦ మక్కువ నొసవియు
శయనించితిమి యొక్క ♦ శయ్యపైని
శైశవముననుండి ♦ శ్రీమలొందనీక నా
సర్వకార్యంబుల ♦ సల్పితీవు
చిరకాలముననుండి ♦ గురుభావమునగొల్చి
వనిలోని ఫలము లిం ♦ పెనయ నిచ్చి
తే॥ యింతదనుక రక్షించితీ ♦ విప్పుడిచట
నన్ను విడనాడిపోతివా ♦ యన్న! కనుల

జూడ నెగ్గేమి యొనరించి ♦ నాడనయ్య
అకట యసురునిచేత ని ♦ ట్లయితివయ్య॥

సుగ్రీ—మహాత్మా! సర్వమెరింగిన మీరే యిట్లు దుఃఖింప మాబోటివారిగతి యే మగును? దుఃఖోపశమనము జేసికొనుడు.

రాము—ఓయీ! సూర్యసూతీ! నాకాపదలమీఁదనే ఆపదలు వచ్చుచున్నవి.

గీ॥ రాజ్యమేలుట లేక న ♦ రణ్యములకు
జనుటయేగాక, నసురచే ♦ జనకసుతను
గోలుపోవుటగాక, నా ♦ కుడిభుజమ్మ
నైన, లక్ష్మణుఁడనిపడ ♦ నయ్యెనయ్యొ॥

విభీ—ఓయీ హనుమంతా! రఘుకులేంద్రునకు దుఃఖమంతకంత కధికమగుచున్నది. లక్ష్మణుఁడు మృతినొందెనో లేక మూర్ఛనొందెనో కనుగొన సుషేణునకు దక్క మనకు దెలియదు. కాని యింద్రజిత్తుబాణవేదనకు నిలువలేక యేమూలనో పరితపించుచుండవచ్చును. నీవు శీఘ్రము గాఁజని యాతనిఁదోడ్కొనిరమ్ము.

ఆంజ—చిత్తము! ఆతఁడు బాణవేదనచే కదలలేకుండిన నాభుజములపై నిడికొని క్షణమాత్రములో వచ్చెదఁ. సెలవొసంగుడు. (అని నిష్క్రమించును.)

రాము—హా! లక్ష్మణా! అతికాయాదిగర్వాపహారా! నన్నింతదుఃఖమున ముంచితివి!

మ॥ మును గాధేయుని యజ్ఞరక్షణమునఁ ♦ మోపెట్టి నాకండవై
కనులన్ మూయక దుష్టదానవుల వే ♦ డ్కన్ నీవు ఖండించ నేఁ
గని నీయంతటితమ్ముఁడుండు టది భా ♦ గ్యంబంచు నేనెంచ నో
యనుజా! పల్క వదేల నాకిపుడు సా ♦ యంబుండ నీకొప్పదే?

అయ్యో! సోదరా! జనకచక్రవర్తినిజాంగణమున నూర్మిళాసహితంబుగా పెండ్లికొమరుండవైయుండ పరమసంతోషమున జూచిననేను నీభంగపాటు గూడఁ జూడవలసివచ్చెనే. హా! లక్ష్మణ! లక్ష్మణ!

చ॥ వనమున కేను రాఁగడగు ♦ పట్టున తోడఁ ప్రయాణమైన ని
న్గని వలదంచుఁబల్క విన ♦ కన్ నను మీవెను వెంట గొంచుపో
మ్మనుచు ప్రమాణముల్ జనని ♦ పై వెసలెక్కకు మిక్కటంబుగా
నన మదిబొంగి వల్లెయని ♦ యంగనగూడుకఁ జేరి యాజిలో
ననుజుడ! నిన్నుగోల్పడితి ♦ నమ్మల కేమని విన్నపించెదన్?

హా! తమ్ముడా! అయోధ్యకు నేనెట్లుపోదును? పోయిననాలినయుఁ డేడని సుమిత్రామతల్లి యడిగినంతనే నిన్నుమ్రింగితినని చెప్పనా? హా! తమ్ముడా! నీశోకభారమున మనకులమంతయు నస్తమించునుగదా!

(అంత హనుమత్సుషేణులు ప్రవేశము.)

సుషే.—రఘునందనా! జయము! జయము!

రాము——అయ్యో! సుషేణా! యింకెక్కడిజయము? శైశవమునుండియు భక్తిభావమున సేవలుసల్పిన యనుంగుసోదరుండును నాదక్షిణభుజంబునునగు లక్ష్మణకుమారునకు భంగమున్న విచారమానసుండనై యున్న నాకు జయముగల్గునా?

సుషే.—అయ్యో! యూరడిల్లుమూరడిల్లుము. (అని లక్ష్మణుని నాడీలక్షణాదుల బరీక్షించి)మహాత్మా! రాఘవా! లక్ష్మణకుమారుని ముఖకాంతిజూడ పూర్ణిమాశశాంకునిరీతి విరాజిల్లుచున్నది. ఇట్టి తేజముండుటచే నితనిమేన బ్రాణము లున్నవి. (మరలజూచి) దేవా! యిది నిక్కముగా మూర్ఛ. నామాట నమ్ముము. ఈమూర్ఛ దీరుట కొకయుపాయముగలదు. చిత్తగింపుడి. ఈ కార్యమును సాధింప నంజనీపుత్రుండుదక్క యితరులకు సాధ్యముకాదు. కావున ఆకార్యమున కాతఁడు సాహసించవలయును.

అంజ—సుషేణా! స్వామికార్యము దీర్చ వెనుకాడెదనా? వేగమే చెప్పుము. మూర్ధ్ని ధరించి నిమిషమాత్రంబున నెరవేర్చెద.

సుషే—అట్లయిన వినుము. నీవు వరుణాలయంబుదాటి యుత్తరదిక్కునకరుగుము. అందు హిమాలయంబు కనంబడు. దాని కావలిభాగమున హేమకూటము గలదు. దాని కనతిదూరంబున ఋషభాచలంబు గలదు. ఇవిఅన్నియు నిర్గమించిన మేరుగిరి జేరుదువు. దానిందాటిన కైలాసంబు గనఁబడు. దానికి గడుదూరంబున శృంగవంతంబను పర్వతముకలదు. దాని కుత్తరదిశయందు నీల శ్వేతకనకాంబరము లనెడిపర్వతంబులు గన్పట్టు. వాని కావలిభాగంబున లవణక్షీరసముద్రంబులును, శాకద్వీపంబులు గలవు. నీ వాసముద్రంబు లంఘించితివేని చంద్రనగంబును ద్రోణాద్రియుం గలవు. ఆరెండు పర్వతములమధ్య మహోదయపర్వతంబు కలదు. అందు విశల్యకరణి, సంధానకరణి, సౌవర్ణకరణి సంజీవకరణి, యనువవి నాలుగుభాగంబులుగా విభజించియుండు. అందు శ్వేతపర్ణంబులచేతను, మొట్టని సుమంబులచేతను పచ్చనిఫలంబులచేతను, రాజిల్లు నోషధులుకలవు. అవి నిశీథిసమయంబున పరాక్రమంబుగను, దివంబున కళావిహీనంబులునై యుండు. కాన నీవు వాని నెట్లయిన సాధించి ఇచ్చటకి దెచ్చితివేని రామానుజుండు మనును. ఇది నిశీథిసమయమగుటచే మిగుల నేర్పరితనము వహించి యరుణోదయము కాకమున్నే యెట్లైనను దేవలయు. లేకున్న లక్ష్మణునకు ప్రమాదముజరుగును.

రాము—అంజనీపుత్రా! దుఃఖసాగరమునమున్న నన్ను దరిజేర్పుము.

గీ॥ అనుజసముఁడవు నాకు నీ ♦ వాంజనేయ
నీకు లక్ష్మణుఁడట్లె య ♦ స్తోకమతిని

నోషధులఁదెచ్చి తమ్ముని ♦ నొనరఁబ్రతుక
జేసికొనుమయ్య కీర్తిగా ♦ ర్జించుమయ్య॥

ఆంజ—స్వామీ! మీరింతగా నొక్కిచెప్పవలయునా? ముహూర్తమాత్రంబున నోషధులఁ దెచ్చెద చూచుచుండుఁడు. (అని నిష్క్రమించును.)

రాము—సుషేణా! నీవు చెప్పినచొప్పున ఆంజనేయుండరిగె. అచ్చట వాని కపకార మొదవదుగదా! (లక్ష్మణునిజూచి) అయ్యో సౌమిత్రీ! ప్రమత్తుఁడైన ఇంద్రజిత్తుని దెగటార్చి భూజనులచింతలెల్ల దీర్చితివని సంతసించితిగదా. ఇంతలో నీకిట్టియాపద చేకూరినది. అయ్యో! సుషేణా!

ఉ॥ ఒక్కఁడు ద్రోణగుబ్బలికి ♦ నొప్పుగఁ జేరనె జేరుబోసుమా
అక్కడి దేవదానవుల ♦ నాజిని గూల్చునె గూల్చుబోసుమా
జక్కవరేడు రామునువు ♦ సంజివి దెచ్చునె, దెచ్చుబోసుమా
ఎక్కడి మృత్యుదేవ తిటు ♦ లీతనిడాసెనె బాసెబోసుమా.

సుషే—దేవా! శాంతింపుము. ఘుం రన్నటుల నమితబలాఢ్యు లహర్నిశంబు లచ్చోటఁ గావలియుందురు. అది తెచ్చుటకు హనుమంతునికిదక్క నొరుల కసాధ్యంబు. అదియెఱింగియే యతనిబంపితి. అతఁ డిప్పటికి నోషధీయుతం బుగ మరలి ప్రయాణోన్ముఖుండు గావచ్చును.

రాము—అయ్యో సౌమిత్రీ!

ఉ॥ అంబయు దేవి నన్నడుగ ♦ నక్కట యేమనిబల్కువాఁడ నా
వెంబడి నీవురాక జన ♦ వేదురునే యిటు దెల్పఁజాలనో
యంబయు రాణి సోదరులు ♦ హా! యని నన్నిటు దూఱువారలో
యంబుజనేత్ర లక్ష్మణుఁడ ♦ యొందరు నీకడ జేరువారలే॥

(అప్పుడు అరుణకాంతి మెరయును.)

(కోపముతో) ఆ యేమీ! వీనిపొగరు! చూడు చూడు ప్రాద్దిక. విభీషణా!

(50 అనుబంధము.)

చం॥ ఇనకులదీపకుండిపు డ ♦ హీనవహార్తిఁ స్మృతిదప్పియుండ నీ
మనమున నీర్ష్యబూని వడి ♦ మారుతిరాఁకకు మున్న దోచినఁ
ఘనమగు నాశరాగ్ని నిను ♦ గాల్చెద నిల్వుము గాచికొమ్ము నీ,
మనమున చింతసేయుమిట ♦ మాయెడ వైరము జూపగల్గుదే॥

ఓరీ! శత్రుజనపక్షపాతీ! నీతిదప్పి జ్ఞాతివైరము జూపవచ్చితివా? నిను దెగటార్చి లోకమంతయు అంధకారబంధురము జేసెద చూడు. (అని బాణ మెక్కుబెట్టును.)

(తెరలో)

గీ॥ వాయు పుత్రకుండీగతి ♦ వచ్చుచుండె
నోషధుల కాంతి యది గాని ♦ యొండుగాదు
సాహసంబున కిపు డవ ♦ సరముగాదు
రామ సద్గుణధామ! నం ♦ గ్రామభీమ!!

విభీ——దేవా! జయము జయము సౌమిత్రి పునర్జీవితుండయ్యె ఓయీ సుషేణా ఓషధులెరుంగక వాయుతనయుండు పర్వతమునే పెరికి తెచ్చుచున్నాడు. నీవు సత్వరము జని యోషధుల వెదకి తెమ్ము.

సుషే——ఆంజనేయుని పరాక్రమము కొనియాడ నెవ్వరితరము?

(నిష్క్రమించును)

రాము——విభీషణా! లక్ష్మణుఁడు జీవించునా? యేటికీయాస?

(హనుమత్సుషేణులు పునఃప్రవేశము.)

విభీ—— కపీంద్రా! లక్ష్మణకుమారుని శీఘ్రముగా మూర్ఛనుండి దప్పింపుము.

సుషే.——చిత్తము. (ఓషధుల ముక్కుదగ్గరనిడి) అయ్యా! లక్ష్మణా! ఇంక నిద్ర నుండి లెమ్ము.

లక్ష్మ—— (లేచి కోపముతో) ఓరీ! దనుజాధమా! పారిపోకుము. పారిపోకుము.

ఉ॥ రావణ! సంగరమ్మునకు ♦ రమ్మిక జాలము సేయఁబోకు బల్
కావరమూని నన్ను పటు ♦ కాండనుచన్ వెసమూర్ఛబుచ్చితే
బ్రోవగనిన్ను శంకరుడు ♦ బ్రోడనటంచని యడ్డువచ్చినన్
లావరిబట్టి కాలుని పు ♦ రంబున కంపెద నీక్షణంబునన్॥

రాము——ఆహా! ఇప్పుడుకదా నేను ధన్యుడ. లక్ష్మణా!

(లక్ష్మణ హనుమంతులపైఁ జేతులు వైచి సంతసమున)

ఉ॥ శోకముచే గృశించి గను ♦ సొక్కినగాత్రము తావమూర న
స్తోకత కౌగిలించి యిటు ♦ జూచినమీదటి కార్యమూననో
(అని కౌగిలించుకొనును ఆంజనేయుని జూచి)
శాకమృగేంద్రచంద్ర మరి ♦ జానకిజాడల దెల్పినాడ వీ
భీకరమూర్తి లక్ష్మణుని ♦ బేర్మిదలిర్పగ బ్రోచినాడవో॥

తమ్ముడా లక్ష్మణా! ఓయీమారుతీ! యిప్పుడుగదా నావ్రతము ఫలించినది. ఇక నాకేమిః కొఱత. అయిన నిటువినుడు. మరియు నోవాయు నందనా! లక్ష్మణా!

శా॥ ఓరీ రావణ! క్రూర! దుష్టమృగతు ♦ ల్యా! యింతకాలంబు దు
ర్వారక్రోధవిధిన్ మదించి జగముల్ ♦ బాధించి తీవింక మ

త్కారోగ్రసి నురంబుచించి శిరముల్ ♦ ఖండించినిన్నెరిడి హృ
ద్ద్వారంబెల్ల నడంచి శీఘ్రముగ భూ ♦ తప్రీతిగావించెదన్॥
ఉ॥ ఈసరి దానవాధముని ♦ నేననియుంచున మ్రింపనైతినా
భాసురమొప్ప బంక్తిరధ ♦ పార్థివపుత్రుఁగాను నైకజుల్
దోసవిహీను లిద్దరికి ♦ సోహలి లక్ష్మణుకగ్రజుండగాఁ
వాసిచెలంగునట్టి రఘు ♦ వంశమునందునఁ బుట్టలేదుగా॥

(తెరలో—రావణాసురుడు)

రావ—ఓరీ నరాధమా! రామా! పారిపోక నిలువుము.

విభీ—స్వామీ! దనుజాధముడు క్రోధోద్రేకమానసుండై దేవరబలంబుల నురుమాడి మిమ్మెదిరించ నిటే వచ్చుచున్నాడు. ఇంక దేవరవారు రణసన్నాహమున నుందురు గాక!

సుషే—ఆంజనేయా! ద్రోణగిరిని మరల దానినిజస్థానంబున స్థాపితము జేసిరమ్ము. లేకున్నచో హానికలుగును

ఆంజ—చిత్తము. అలాగే (అని నిష్క్రమించును)

రాము—ఓయీ విభీషణా! మీసోదరుండెంతమూర్ఖుఁడోయి!

గీ॥ కొమరు లాప్తులు మంత్రులు ♦ సమరమునను
మామకీన శరాహుతి ♦ మడసిరెల్ల
తానుగూడ నశించగాఁ ♦ దరలెనిపుడు
మీరు నెరగలిఁబడనచ్చు ♦ మిడుతవోలె॥

ఈదురాత్ముడు నాచేతహతుడగును సుమా!

విభీ—దేవా! లోకకంటకుడగు నాతడు చచ్చుటే శ్రేయము.

(ప్రవేశము రావణుడు) (51 అనుబంధము)

రావ—ఓరీ! భీకరాకారుడగు రావణుని జయించవలెననియేనా వచ్చినది? నిన్ను జయించ నేను కావలెనా? మొన్న నాకుమారుడగు మేఘనాథుడు నాగాస్త్రము ప్రయోగించ దానిచే బందీకృతుడవై గ్రుడ్లుతేల్చి చూచుచుంటివి కాని దానినుపసంహార మొనరింపనైతివే! ఔరా! కోతిమూకలగూడి నేనొక వీరుడనని వచ్చితివా? నీవు క్షత్రియవంశసంభూతుడవేయైన నన్ను దురమందు గెల్చి మరలిపొమ్ము.

రాము—ఓరీ! దానవాధమా! క్షత్రియాంశసంభూతుఁడ నగుటచేతనే క్షత్రియధర్మముఁగుర్తెరిగి యుద్ధమునకువచ్చితి. కాని నీవలె యుబలలనుముచ్చిలుటకురాలేదు

రావ—ఏమిరా! నీ శ్రీరంగనీతులు? జగదీశ్వరుండగు రావణుని గుర్తెరుంగవా? ఓరీ నరాధమా?

ఉ॥ కోతులఁగూడి వృక్షముల ♦ కొమ్మకుఁ గొమ్మకు నెక్కి దూకుటల్
భూతలమేలువాఁడనని ♦ భూరిశరమ్ములఁ గేలఁదాల్చుటల్
హేతువులేక వాలిఁ బడ ♦ నేసి మనంబున సంతసించుటల్
ఖ్యాతివినాశహేతువగు ♦ కార్యము లియ్యవి రాజనీతులే?
ఆహా! యెంతరాజధర్మవేత్తవురా! (52 అనుబంధము.)

రాము—నీవు నన్ను గేలిచేయుచుంటివా? నీరాజధర్మమేమి!

ఉ॥ స్త్రీలను బల్మిబట్టుటలు ♦ ఛీ యని వారలుబల్క రోయకే
చాలగ సంతసించుటలు ♦ జారతఁగూడ ప్రధానమంచెదర్
జాలగనమ్మ దిమ్మరికి ♦ సాటియెచూఁడగ సాధులేభువిన్
గూళతనంపు చేష్టలకుఁ ♦ గూడుదు వీవిల రాక్షసాధమా!

రావ—ఓరీ! సిగ్గులేక బల్కుచుంటివా? నీవు కలుషాత్ముండవని యెరింగియేకదా నీతండ్రి నిన్ను కానలకుఁ బంపి నీతమ్మునికి రాజ్యమిచ్చినది? ఇదిగాక అడవు లందుగల యాకలముల మెక్కి యేమూలనో పడియుంటలేక తగుదునని యుద్ధము సేయవచ్చితివా?

రాము—ఓరీ! సత్యసంధుండగు మాతండ్రిగారు మున్ను పల్కిన పల్కుల నిల్ప కానల సంచరించుచుంటిగాని యొండొక కారణముగాదు. భరతుఁడు నా యందొక యధర్మము నిరూపించి యిట్లు చేయులేదు. మరియు.

చ॥ తలపక వేదశాస్త్రముల ♦ దగ్ధము జేయుచు మానివర్యులన్
బలిమినిఁబట్టి హవ్యముల ♦ భక్షణ జేయుచు వారిమొత్తుచున్
గలయికఁబెట్టి విప్రులఁజా ♦ కాటపుగోవుల దన్కరించుచున్
సొలయిక నాడఁబిడ్డల మ ♦ నోజ్ఞత జంపెడు క్రూరులుంటచేన్.

అట్టి లోకకంటకులఁ బరిమార్ప మాతండ్రిగా రనుజ్ఞ యొసఁగుటచే వచ్చితిని. వారియాజ్ఞాప్రకార మీదోషములన్నియు నీయందు బొడచూపు చున్నవి. మరియు కాలమాసన్నమైనవానియందు బొడకట్టులక్షణములు నీయందే బొడకట్టుచున్నది. కేవల మధర్మస్వరూపుఁడవు, జగత్కంటకుండవు నగు నిన్ను వధించుట నాకవశ్యకర్తవ్యము.

లక్ష్మ—ఓరీదానవాధమా! ఇంకనైన దెలివిదెచ్చుకొని యీరాముఁడు భగవం తుండని మున్మాటికి నమ్ముము.

రావ—ఓరోరి! నలువుర ముప్పుర బక్కరక్కసుల జంపినంతమాత్రమున నీయన్న భగవంతుడగునా? నీయన్న భగవంతుడేయైన యొరుల సహాయమేలకోరును? కోరెనేపో. కోతులా యీ భగవంతునకు సాయము? ఈతడు భగవంతుఁడని యన జనులెల్లరు నమ్మి చెడిపోదురుగాన యిట్టినీచపు బల్కులుబల్కకుము.

లక్ష్మ—అన్నయ్యా! సన్నిపాతరోగి ప్రేలినట్లు ప్రేలెడి వీనిప్రేలుడుసన్నిపాతమును వీరా బాణప్రహారము లనేయోషధుల నుపయోగించి వీనివ్యాధి కుదిర్చి లోకుల రక్షింతురుగాక.

రాము—ఓరీ! పిశితాశనా! నేనే నిన్ను జయించవలెనా? నాకు సాయమగు కోతియే

ఉ॥ తోకనుజుట్టి మున్ను నిను ♦ తోయధులేడును ముంచె, గోతియే
జోకదలిర్పనీసుతుల ♦ జోదులజంపెను మున్న కోతియే
వీక సముద్రముం గడచి ♦ వేగమనీపురిం గాల్చె గోతియే
భీకరమైన నీతలలు ♦ భిన్నముగానటుదన్నెఁ గోతియే॥

ఓరీ! నిన్నన బనిలేదు,

గీ॥ ముదిమిచే మదిజెదరిన ♦ మొదటివేల్పు
నిన్ను సృజియించె లోకుల ♦ వన్నదరుగ
నైనగానిమ్ము త్వరలోన ♦ నాజినిన్ను
బిలుకుమార్చెదఁజూడు ని ♦ ర్భీతిచేత॥

ఓరీ! నీవు నలువచే సురాసుర గరుడగంధర్వాదులచే జావకుండ వరంబు గోరితివిగాని, నరులచేతను వానరులచేతను జావకుండునట్లు గోరలేదు. అది గ్రహించి నే నినకులాగ్రగణ్యుండగు దశరథేశ్వరునకు సుతుఁడనై జన్మించితి. దేవతలెల్లరు నీకొరకై వానరులై జన్మించిరి. ఈ వృత్తాంతమంతయు తొలి నారదుండు నీ కెరింగించినను మదాంధకారముచే కన్నుఁగానక నాకే యపకారమొనర్చితివి. ఓరీ నిశాచరా! ఇప్పుడైన నది గ్రహింపజాలక మేరమీరి ప్రేలుచుంటివి. నీయెడ కారుణ్యమువీడినిన్ను దుంచుటయే నాకు గర్తవ్యము.

ఓరీ! దానవాధమా!

గీ॥ త్రివలిమలల్లుఁడో లేక న ♦ వ్వనజభవుఁడో
జలజనాథుఁడో నిన్ను ర ♦ క్షణముసేయ
దలచివచ్చినరానిమ్ము ♦ దర్పమడచి
నాశరాళికి నిన్నర్ప ♦ ణంబుసేతు॥

రావ—(కోపముతో) ఓరీ పశువా! నీవ్రగల్భములతో నేమిపని? నీవు దశరథుని కొమరుండవేమైన నన్ను గడ తేర్చిపొమ్ము. లేకున్న తొలగిపొమ్ము

(తెరలో)

రావణాధముడు జావవలెను! చావవలెను! రఘుకులరత్నమా! శీఘ్రముగ,

గీ॥ సాహసముజూపుమిదె మంచి ♦ సమయముక్ష్మా
రణముజాలించి శ్రీరఘు ♦ రామచంద్ర

దానవారణ్య ఘోరదా ♦ వానలంబు
నై సబ్రహ్మాస్త్రమును మంత్ర ♦ మానిబంపు॥

రావ—ఔరా! సురలుకూడ వీనికే సాయమొనంగ సాహసించినారె! కానిమ్ము. ఈనరాధముని ముందువధించి పిమ్మట దేవతలతాడు దెంచెద. (అని శరము వేయును)

రాము—(కోపముతో) ఓరీ జగత్కంటకా! దేవపాంసనా! ఇదిగో బ్రహ్మాస్త్రమును ప్రయోగించుచున్నాడను.

చ॥ మదమున గన్నుమిన్ గనక ♦ మాన్యులకష్టము బెట్టుటెల్లనే
నిదివర కచ్చటచ్చట వి ♦ నే మరియూరకయుంటిఁగారణం
బదిగదియంగ నీవు జన ♦ కాత్మజ దెచ్చితివింతలోన నీ
కదనమునందు లక్ష్మణుని ♦ గందగజేసితి పౌర యిప్డు నా
మది నదనంచు నెంచి యను ♦ మానముబీడితి నిన్ను దున్మెదగా॥

(అని బ్రహ్మాస్త్రము వేయును)

రావ—శివ శివా! (అని క్రిందపడును.)

లక్ష్మ—సూర్యనందనా! ఇంక హతశేషంబులను దునుమాడుదము రండు.

సుగ్రీ—చిత్తము.

(అందరు నిష్క్రమింతురు యవనిక పడును.)

తురీయరంగము—లంకాపట్టణము

(రామ, లక్ష్మణ, హనుమత్సుషేణాంగదుల ప్రవేశము)

(53 అనుబంధము.)

రాము—లక్ష్మణా! రావణవధచే లోకమంతయు భయంబుగూని విభీషణ పట్టాభిషేకమహోత్సవము జరుపనెంచి పురజనులెల్లరు సంతోషస్వాంతులై రిగదా!

లక్ష్మ—చిత్తము. దేవరవారు సంకల్పసిద్ధులు గదా! దేవరవారికి మీరినకార్యమేదిగలదు?

రాము—లక్ష్మణా! విభీషణుడింకను సీతను దీసికొనిరాక జాగుసేయ కారణమేమైయుండును?

లక్ష్మ—అన్నయ్యా! అదుగో జనకజనమేతుడై పుష్పకవిమానారూఢుడై వచ్చుచున్నాడు.

(అంత విభీషణుడు సీతతో ప్రవేశము)

సీత—లోకకంటక దశకంఠకంఠవిలుంఠనా! దశరథనందనా! నమస్కారము (అని పాదములు పట్టుకొనబోవును) (54 అనుబంధము)

రాము—(కోపముతో) జానకీ! నాను కడునవ్వున నుండుము. నన్నంటుట కర్హ రా

లవుగావు. ఏలయన, (55 అనుబంధము)

గీ॥ కోమలులయందునొప్పల ♦ కువ్వవైన|నిన్ను రక్కసిగొనిపోమె ♦ నన్ను తాంగి
వాని మోహముదీర్చుక ♦ వదలెఁగాన|వందరిటఁజూడ నిన్గొన ♦ నిందగాదె?

మరియు నోసీతా! ఇందుగలవారు వీరు. ఇటుజూడుము.

ఉ॥ ఈతఁడు సూర్యసూతి, మరి ♦ యీఘనుఁ డంగదు డంగనామణీ!
ఈతఁడు లక్ష్మణుండు, మరి ♦ యీఘనుఁడంజనిపుత్రుఁడౌ జుమా!
ఈతఁడు లంకనేత, ప్లవ ♦ గేశ్వర వైద్యుఁడితండు, చూడుమా
ఈతరి వీరిలోనొకరి ♦ నిష్టముదీరఁగగోరు భర్తగా॥

(తెరలో)

పాపము శమించుగాక! పాపము శమించుగాక! సీతామహాదేవి సాధ్వీ శిరోమణి! ఆమెపై నిందమోపలోకములుక్రుంగిపోవును. సత్యము. సత్యము.

సీత—తల్లీ! అశరీరవాణీ! నాచరిత్రమంతయు నుతువుము. నాథా నన్ను స్వీకరింపకపోయినను అశరీరవాణి సత్యవాక్యములనైనా స్వీకరింపుడు.

రాము—నే నశరీరవాణిని నమ్మను, నిన్నును నమ్మను.

సీత—కరుణాకరులని పేరుగాంచి నాయెడ నింతకాఠిన్యమూనుట చూడనాకర్మమని తలంచెద. నాథా! పరిణయమైనదాదిగా నన్ను ప్రేమమీర గాచి నా గతి యంతయు నారసి నేడు నాపై దోషమారోపించినచో లోకులూరకుందురా? దేవా! మీపాదములసాక్షిగా ముమ్మాటికి నేను నిరపరాధిని. ఇంకను నమ్మలేని యీ యపవాదు నేభరింపజాల. గాన మీఖడ్గముచే జంపుడు. లేకున్న నగ్నిప్రవేశమయ్యెద. అనుజ్ఞ యొసంగ వేడుచుంటిని.

రాము—జానకీ! నీవు సుచరిత్రవే గావచ్చును? కాని నీపై మోహముచే నారక్కసి నిన్నుగొనిపోయె నీపై భ్రాంతిగలవాడనై మందమతిచేత నిన్ను మరల రావించితిని. ఈపట్ల నిన్ను గ్రహించితినేని యీ లోకులెల్లరు నన్నునిందించెదరు. ఇదియటుండ లోకమున కొక యనాచారమున కునికిపట్టు జూపినవాఁడనగుదును. కాన నిన్ను ముమ్మాటికి స్వీకరింపనొల్లను.

సీత—నాథా నన్ను మీరనుగ్రహించకున్న నాకు మరణమే శరణము. కాన పావకునిలో నైక్యమయ్యెద సెలవొసఁగుడు.

రాము—మంచిది అట్లనే సేయుము ఓయీ హనుమంతా నీవుపోయి కాష్టములంజేర్చి యగ్నిని బ్రజ్వరిల్లునట్లు జేయుము.

ఆంజ—స్వామీ! లంకయందుండినను నీమె పాతివ్రత్యమునే యాచరించినది. కాని పాపమాచరించి యుండలేదు.

రాము— (కోపముతో) చాలుచాలు. నాకు నీవు నీతులు నేర్పవచ్చితివా? ఇనకులో త్తము లధర్మమునకు లోబడరు.

లక్ష్మ—అన్నయ్యా! చిత్తగింపుడు. జానకి మహాసాధ్వి. ఈమెపై నిట్టి క్రూర మాపాదింప దగదు. గాన నీ పవిత్రురాలిని గ్రహింపుడు.

రాము — (కోపముతో) మీరందరు నాకు నీతులు జెప్పనక్కరలేదు. మీధర్మోప న్యాసము లింకకట్టిపెట్టుడు. ఏమీ ఆంజనేయా నీకిష్టములేక నాయేమి? ఆలోచించుచున్నాడవు. నాయాజ్ఞ యనాచరణీయమని సందియంబుగల్గిన యాకార్యము నేనే నిర్వర్తించుకొనియెద, నీవు పొమ్ము.

ఆంజ—(చెవులు మూసికొని) హరి హరీ! స్వామియాజ్ఞ యెట్టిదైనను నెరవేర్చవలె నుగదా. (నిష్క్రమించును.)

(యవనిక పడును.)

---

(పంచమరంగము. మండుచున్న అగ్నిగుండము.)
(సీతా రామలక్ష్మణ, సుగ్రీవాంగదాదులు ప్రవేశము.)

సీత—

చం॥ ఇనకుల వార్థిచంద్రమ! న ♦ రేశ్వర! శ్రీరఘురామచంద్ర! నే
ననయము నీ పదాంబుజము ♦ లాత్మనుతించు చహర్నిశంబులన్
మనమున మిమ్ముదక్క నొరు ♦ మాటదలంపని దాననైన నీ
యనలుడు చల్లనై యిట స ♦ హాయము జూపి ప్రసన్ను డయ్యెడున్॥

(నమస్కరించును.)

రామ —మంచిది, అట్లనే గానిమ్ము.

సీత—

చం॥ స్థిరమతులార! యోసకల ♦ దిక్పతులార! త్రిమూర్తులార! కి
న్నరవరులార! కింపురుష ♦ నాగకులోత్తములార! దేవఖే
చరవరులార! సిద్ధముని ♦ సత్తములార! సుసాధ్యులార! భా
స్కర యమ్మృతాంశులార! గురు ♦ కారణ భూతములార! బ్రోవరే॥

గీ॥ మీరలందరు సాయమ ♦ మేయమతిని
జేయఁగల బ్రార్థనము వాది ♦ జేయుదాన
గాన నే సాధ్వి నగు టీజ ♦ గానవెరుఁగ
నట్టి పుణ్యాత్ము లెవరని ♦ యందునకట

తండ్రీ పావకా! నానాథుఁడు నాయెడలేని దోషము నిర్ణయించి నిందపా లొనరించె ఇట్టి యపఖ్యాతినొందుటకన్న మరణమే శరణ్యము. ఓపవమాన మిత్రమా!

ఉ॥ రాముని నామమంత్రము తి ♦ రమ్ముగ నే జపియింతునేని న
త్పేమ మనారతంబు రఘు ♦ వీరునియందు ఘటింతునేని యీ
భూమిజ నైతినేని పర ♦ పూరుషులన్ మదినెంచనేని నా
నోములు నీమములు పవిత మ ♦ నూనత వెల్లడిఁ జేయుమి త్తరిన్॥
చం॥ అనలుఁడ! నందియంపడక ♦ నాహుతిగాఁ గొనుమయ్య వేడుకన్
ననుు మహాసీయులందరు గ ♦ నన్ గరుణారస ముంచి సత్వరన్
మనకులమూర్తిరామునకు ♦ మానినిఁగాగను జన్మ జన్మ మం
దని మదినెంచి నీయుదర ♦ మందునఁజొచ్చెద హవ్యవాహనా॥
(౮౨ అనుబంధము.)
(అని అగ్నిగుండమునందు దుముకును. అగ్ని చల్లారును.)
రాము—అయ్యో! మైథిలికి ప్రమాదము సంభవించినది. లోకమునకు భీతి జెంది నేను నిరాకరింప సీత యెంతపనిజేసినది. అన్నన్నా! అయ్యోసీతా! యీపవిత్ర యాగ్ని చల్లార్పనా? సాధ్యమగునా? అయ్యో! నేనాలోచించునంతలో సీత మసియగునుగదా! ఛీ. ఇంక బ్రియకాంతతోడ నేనును కృశానుని జేరెద. (అనిలేచును.) ముందుకుజూచి యేమి యీవింత!
ఆ॥ వె॥ అగ్నిచల్లనైన ♦ యట్టులగన్పట్టు
జ్వాలలేవి సీత ♦ జాడఁజూడ
జిత్రమయ్యెనాకు ♦ సీతచరిత్రంబు
కలయొ లేక భ్రమయొ ♦ గాంచనిపుడు॥
(అంత అగ్నిదేవుఁడు సీతతో ప్రవేశము.)
అగ్ని—రామా! రవికులసోమా! సకలాంతర్యామివైన నీవు జడునిరీతి నిట్టి యనాచారము లాచరించితివేమి? పతివ్రతామతల్లియగు యీతల్లిస్పర్శచే నీతి పాత్రుండనగు నేనే పవిత్రుండనైతి. ఇంకనీవు శంకించక యీసాధ్వీ శిరోమణిని స్వీకరింపుము. మాపలుకులుగూడ నసత్యమని తోచిన మిమ్ము స్తోత్రముచేయు విమానారూఢులై యింద్రాదిదేవత లిటువచ్చుచున్నారు.
(అని నిష్క్రమించును.) (అంతట బ్రహ్మేంద్ర మహేశ్వరదశరథులు ప్రవేశము.)
బ్రహ్మ—దశావతారధారీ! జయతు జయతు.
రాము—సర్వసృష్టిధీరా! పితామహా! వందనములు.
శివుడు—రావణాంతకధీరా! జయతు జయతు.
రాము—గిరిజాసుతామనోహరా! హరా! వందనములు.
ఇంద్రు—దనుజాంతకా! వందనములు.
రాము—నాకపురాధీశ్వరా! స్వాగతము.

ఇంద్రు—రామా! సంగ్రామభీమా! నీవిజయమున కమందానందహృదయారవిందుడై నీతండ్రి దశరథేశ్వరుఁడు వచ్చియున్నాడు.

రాము—(తత్తరపాటున జూచి) పుత్రశోకమున దివికేగిన తండ్రిగారి కిదే నమస్కారములు.

దశ—తనయా! రాజ్యాభిషేకమస్తు.

లక్ష్మ—తండ్రీ! సుమిత్రాపుత్రుఁడిదే వందనము లాచరించుచున్నాడు.

దశ—వత్సా! దీర్ఘాయుష్మంతుఁడవు గమ్ము.

సీత—స్వర్గనివాసులగు మామగారి కిదే వందనములు.

దశ—కల్యాణీ! పూజ్యులగు పుత్రులను బడయుము. (రామునితో) నాయనా ఈమె చరిత్రమంతయు నెరింగియు నిట్టులాడుట నీవంటి ధీనిధులకు తగునా?

రాము—తండ్రీ! యిందులకు నన్ను క్షమింపుడు. ఏలయన అసురాలయమందిన్ని దినంబు లొంటరిగనున్న యీ సీతను గూడి నే నయోధ్య జేరఁ బౌరులెల్లరు నిందజేయుదురను తలంపుతో నిట్లొనర్చితి. అగ్నిదేవుడుసైతమీయామె పాతివ్రత్యమునకు సంతసించి సర్వము నెరిగించి చనియె. కాని యీయామె యందు దోషమున్నదని యిట్లొనరించలేదు. ఇందువిషయమై జానకికూడ సంతసించవలెను.

సీత—నాధా! భవదీయ సన్నిధానమే నాకు ముదావహము.

బ్రహ్మ—రామచంద్రా! లోకకంటకుండగు రావణాసురుని సంహరించి సర్వజంతుజాలమునకు మేలొనగూర్చితివి. ఇంక నీ వయోధ్యకుం జని పట్టాభిషేక మహోత్సవ మొనరించు కొనవలయును.

రాము—చిత్తము.

ఇంద్రు—దేవా! నే జేయవలసిన కార్యమున్న సెలవొసంగుడు. నిర్వర్తించెద.

రాము—అయ్యా! శచీధవా! నానిమిత్తము కొందరు వానరులు మృతినొందియుండిరి. వారి కమృతవృష్టిచే ప్రాణదాన మొసంగుము. ఇదియే నాకోరిక.

ఇంద్రు—చిత్తము, కుంభకర్ణునిచే మ్రింగబడిన వానరులు దక్క, తక్కిన వారు పునర్జీవితులయ్యెదరు గాక!

దశ—లోకమాతా! సీతా!!

గీ॥ పతియె దైవతమగు నెందు ♦ పడఁతులకును
పతియె బంధువు ప్రాణంబు ♦ పరమహితుఁడు
గాన శుశ్రూషఁజేయ నీ ♦ త్మ్యాతలమున
నతివచరితము గొనియాడ ♦ నర్హమగు నె?॥

మరియు, భూజబలాఢ్య సంపన్నులును, పరమపవిత్రులును, ధీనిధులునగు బుత్రులబడయుము.

శివు— దశరథనందనా! మేము స్వర్గమునకు బోవుచున్నారము. కమలగర్భుడు విధించినట్లు నీ రాజ్యమునకు బోయి పట్టాభిషిక్తుడ వగుము.

రాము—చిత్తము.

(బ్రహ్మేంద్రి దశరథ మహేశ్వరులు నిష్క్రమింతురు.)

రాము—విభీషణా! జాగుసేయక యయోధ్యకు బ్రయాణము కమ్ము.

విభీ—చిత్తము. కౌబేర పుష్పకవిమాన మిదివరకే సిద్ధముజేసితిని. దేవరవారు దానినారోహింతురు గాక.

రాము—మంచిది. దానినెక్కి యెల్లర మయోధ్యకు పోవుదము.

విభీ—చిత్తము. మహాప్రసాదము.

రాము—ప్రియకాంతా! జనకజా! (సీతపైన జేయివైచి)

సీ॥ సుందరి! నీవయి ♦ నింద మోపితినని
కుందకు నీమది ♦ మందగమన!
కొంద రజ్ఞులు ముందు ♦ నిందింతురంచు నీ
చందంబు జేసితి ♦ కుందరదన!
యిందు నిక్కపుటీలు ♦ నందరకునుజూపి
వందితురాలవై ♦ యిందువదన!
పొందుగా నినువేడి ♦ బృందారకులు ముదా
నందులై చని రక ♦ విందనయన!
గీ॥ డెందముననున్న చింతల ♦ సందియముల
నందముగ వేడ దరుచర ♦ బృందసహిత
మందర మయోధ్యకరిగి యా ♦ నందముగను
నుంది మికరమ్ము బందుగుల్ ♦ సందడింప॥

(యవనికపడును.) (అందరు నిష్క్రమింతురు.)

---

## షష్ఠమరంగము.

---

(అయోధ్యానగరము - పట్టాభిషేక మండపము.)

(సీతా, రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులును, వసిష్ఠ విశ్వామిత్రాది మునీశ్వరులును, సుగ్రీవ, విభీషణ, హనుమదంగదాది వానర ప్రముఖులును, మరికొందరు పురజనులును ప్రవేశము.)

విభీ—(కర్పూరము వెలిగించి,)

మంగళమహాశ్రీ వృత్తము.

మంగళము రామునకు ♦ మంగళము మైథిలికి ♦ మంగళము పూజ్యులకు వేగ
మంగళము మత్తతను ♦ మారుకొను రక్కసుల ♦ మారకుడు రామునకు వేడ్క

మంగళము మౌనికుల ♦ మండితున కెల్లదగు ♦ మంగళము వానరుల కెల్లన్
మంగళము భక్తులకు ♦ మంగళము రాజులకు ♦ మంగళము మంగళ మహాశ్రీ

రాము—(లేచి)ఓ సభాస్థారులారా!

చ॥ నెల నెల మూడువానలిల ♦ నిక్కముగా వరిషించుగాత! ని
య్యిలగల సస్యసంతతులు ♦ నింపుగ పంటల నిచ్చుగాత! స
త్పరమపతివ్రతామణులు ♦ భక్తిని నాథులగొల్తురిగాత నే
యలజడిలేక భూమిపతు ♦ లందరు నన్ సమదృష్టిఁజూతురన్॥

భరతవాక్యము:—

ఉ॥ వేడుకమీఱ బండితులు ♦ వేలకొలంది రసధ్వనుల్ దగన్
గూడిన గ్రంథరాజముల ♦ గూరిమితో నొనరింతురిగావుతన్
గూడురు కోటయాహ్వాయుడు ♦ కూర్చిన శ్రీరఘురామ సత్కథన్
బాడిన యాడినన్, భవవి ♦ నాశము మోక్షముఁ గల్గు ధారుణిన్॥

(యవనిక పడును.)

షష్ఠాంకము-సంపూర్ణము.

గద్య.

ఇది శ్రీరామచంద్రకరుణాకటాక్ష లబ్ధకవిత్వ భారద్వాజసగోత్ర బోధాయనసూత్ర
గూడూరువంశ పయఃపారావార రాకాసుధాకర మల్లేశ్వరపౌత్ర నిరంతరశివా
రాధన వేంకటశివకవీశ్వ రాంబమాంబికాసుపుత్ర సుజనమిత్ర

కోటీశ్వరనామధేయ ప్రణీతంబైన

శ్రీ సంపూర్ణ రామాయణము సంపూర్ణము.





శ్రీ

# సంపూర్ణ రామాయణము



## అనుబంధము

విశ్వా— 1 బిలహరిరాగము—ఏకతాళము.

పనుపవా- దశరథా- నావెంట- నీజంట
నేగొంట- నీజంట. పనుపవా
లోకంబులన్- వడంకన్- జేయుకౌశికున్- మెరుగవా-
జాలము- వీడియు - బాలురబంపుము
వేళాయె- బోయెద- వెడగులుచాలించి॥ పను॥

2 కమాసురాగము—ఏకతాళము. జైలాగు.

రాము— జనకా మమ్ముల బిలువగనేలొకో- మనములోన
నేమాటనుదలచితో- అజానునేనున్- యొరసియు
దానిన్- యువలిగానున్ శిరమునదాల్తుము॥ జన॥

లక్ష్మ— మానియెవ్వరో మాకును దెల్పుమి- మాటలాడగను-
మము నేజూచును- మనమునదా- ఘనముగ యో
చనలనుసే- యుచునుండెనిటన్॥ మా॥

దశ— కౌశికుడితడు క్రతువును జేయన్- కామరూపులు
దనుజులుదాకన్- ధ్వంసముసేయన్- హానినిగాయన్-
త్వరగను జేరెన్- నిమ్ముల గోరెన్॥ కౌ॥

విశ్వా— జాగుచేసెదవు సమ్మతిలేదా- సరగునదెల్పుము-
సఖులువినగన్ నేమోగద; యీదన్- జాగునువీడన్-
నేనికవేడన్- నిస్సికజూడన్॥ జా॥

3 బేహాగ్ రాగము—ఏకతాళము.

రాము— సెలవొసగు మాకింకనో- జనకా॥ సెల॥
జన్మముగాచియు- సంయమియాజ్ఞయు-

తిన్నాగవినియుండెదర — మన్ననలను బొందెదర ॥శ॥
మదిలోనగుందకా — దిగులూనుబొందకా
యెదలోన హర్షించుమా — సదయుత మముబంపుమా ॥శ॥

4 మధ్యమావతిరాగము—ఏకతాళము.

హల్య — కౌసల్యాసుత - కాననమందున - ఘనతనురాయిగ - గల్గిన నన్నిక॥
గావుమన్నిక — ఖరకరవంశ — కంబుజాముఖ — కరు
ణ సాంద్ర — సుందరాననా — సురనుతపాత్రా -
సూ త్రిత — సుచరితరామ ॥కా॥
రక్కసి మూకల - సుత్రక్కగగూల్చిన - భీమా నినువడి
గొలిచెద రామా ॥కా॥
గౌతమపత్నినే - కలిగినశాపము - కాననమందున
ఖండన జేసి - రాతిగనుండిన - నాతిగ నన్జేసి - రక్షణ జేసిన
రామ - శ్రీరామా ॥కా॥

5 బేహాగ్—ఏకతాళము.

శ్వా— శివువిల్లు నెక్కుడెడున్ - హాయ్ - - హాయ్ ॥శివు॥
అష్టాదిక్పతులార - స్పష్టముగా - గాంచుడి ॥శివు॥
మానిపుంగవులార - మా రామచంద్రుడు ॥శివు॥
ము— కౌశికమౌనీంద్ర - కరుణించి - సెలవిమ్ము ॥శివు॥
జనకజరాజేంద్ర - సభికులుతోషింప ॥శివు॥
హే! లోకనాటకధారీ - పరబ్రహ్మస్వరూపా - కృపగనవే;
(విరచి)
శివువిల్లునే విరచితిక - హాయ్ హాయ్ ॥శివు॥
దివ్యామతులు నాదు - తేకువ తిలకింపుడీ॥ శివువిల్లు॥

6 అందరు.

శ్రీరామరామ - జానకిరామ
అయోధ్యరామ - అహావక్షేమ - శ్రీరామ
కోదండరామ - కోక్కలధామ
పట్టాభిరామ - పావననామ - శ్రీరామ
జలధరునివిల్లు - సరగూనద్రుంచి
లోన కీర్తి యిల నందినరామ - శ్రీ॥

7 బేహాగ్—ఏకతాళము.

రశురాముడు—పరశురాముడంచు నేను పరగియుండ -పుడమి
దూరదు పీసుడెవడు - కనలినక ॥పర॥

రాముడైన - గీముడైన - భీముడైన - గానివాని
కదనమందు - కదలకుండ - మెదలకుండ - కసియు దీర్చెదన్

8 మంధర

రాజ్యాధిపత్యము - జేసిననాకెంతో - కోపము - రాము - ?
కౌసల్యకు హాయ్
తోషం - భరతునదే దౌర్భాగ్యం
కైకకు వ్రాడిగం - భరతుని సేవకం॥ రాజ్యా॥
ఆహాహా! కైకజా - కార్యముచెడెనయ్యో భూమిజా
కౌసల్యకు మదమిటహెచ్చెన్ - యికరాముడే రాజటజూడన్
యువరాజట లక్ష్మణుడెన్నన్ - కైకకునాకున్
కష్టమువచ్చెన్॥ రాజ్యా॥

9 డైలాగ్.

కైక— ఔరౌర - చాల్లే - తలపులు దెలిసెన్
పురుషుల నమ్మగ దగదిక పొమ్మా ॥ఔ॥
అక్కరదీరెన్ - అతివలజూడన్ - ప్రక్కకురాకన్
నక్కియుపోవన్ - పురుషులకిదియున్ - పరువగనదియున్
అరుగుముజూడన్ - ఆకౌసల్యన్ । ఔ॥

దశ— ఓహొహొ హొహొ - ఇదియా - కోపము - సఖియా
ఆహాహా కైకా - అంతయునీదేకా॥ఓ॥
పేరుకునదియె - పెద్దది సుమిత్రా
పెరిగెను నీపై - మరుగకు ప్రేమా
యిట్టులుబల్కుట - ఇదినీకు తగునా
గట్టిగనమ్ముము - కర మిటుదెమ్మా॥ ఓ॥

10 డైలాగు.

దశ— తరుణిరో నమ్ముము - తగవేలనింకను
కోరినవరముల - కొనుమిదె యిచ్చెద॥ త ॥
భానుడు శశియల - బాటలుదప్పిన
సూనులు - రాజ్యము - శూన్యతనొందిన
భానుకులంబెల్ల - భంగమునొందిన
మానిని - సత్యము-మానను మానను
పట్టభద్రుజేయు డింక - భరతపుత్రునొక్కటన్
పట్టువిడక రాముఁవనికి - పదియునాలుగేడులన్

బంపుడు వేగమె - యింపౌను నాకింక
యివియేను వరములు - యింతియేజాలును॥ పట్టభద్రు॥

11 బేహాగ్—ఏకతాళము.

ముడు— నాదు-జనకాజ్ఞమీరక-సత్యమునిల్పగను-నే-కానల కేగెదను॥నా॥
కైక వరముల-దీర్పగను-నాదు-వందనములగొను-జనని-
దీవనలొసగి నను-పనుపుము-వేగముగ-భయమింక వలవదిక ॥నా॥

12 డైలాగు-ఫీలు రాగము—ఏకతాళము.

ము— అమ్మయిక మదిలోన-దిగులునుబొందకే
దిగులునుబొందకే-వగచేత గుందకే॥అమ్మ॥

— తండ్రియెటు నినుబాసి-ధరమీద నిల్తురా
ధరమీద నిలుతురా-తాళగజాలరా॥తండ్రి॥

ము— కాలకర్మ దప్పించనగ-ఘనులకు దరమటే
ఘనులకు దరమటే-మునులకు వశమటే॥అమ్మ॥

— యేలయిటు వని కేగ-యేలక భూమినిక
యేలక భూమినిక-బేలగజేసినక ॥తండ్రి॥

ము— జనకుని యాజ్ఞనేను - ఘనముగదీర్తుగా
ఘనముగ దీర్తుగా - మనమును బొంగగా ॥అమ్మ॥

13 ఇంగ్లీషునోటు—ఏకతాళము.

కసిదీర్పదక - అసిధారచేక - వెసబోవనేక - పసమీరగక -
భరతుక - గిరతుక - భస్మముచేతుక - కైకక - గయికక -
గసిమసిజేతుక॥కసి॥
మదంబంతక - మహీకతగ్గక - జనుల్ చూడక - శబాసనగక -
మాయలమారినీ-మర్మముదెలిసేను-మంచిది సామిత్రిదుర్మించడే॥కసి॥

— 14 ఇంగ్లీషునోటు—ఏకతాళం.

భూతమునికిటు - పూనెనో బలుకుము
పాతకమెంచక - పానముజేసితో॥భూ॥
సత్యముబల్కుము - పైత్యముబుట్టెనో
నిత్యములేని యా - నీతేల గల్గెనో
మాతనుగూర్చియు - నీతినివిడిచి
ఖాతియెబల్కుట - భావ్యమా లక్ష్మణా ॥భూ॥

15 బేహాగ్ రాగము—ఏకతాళము.

నన్నింక గొంపోగదే - కానకు॥ నన్నింక॥ఇన్నాతినిక॥ వీడకే
శ్రీరామ - శ్రీరామ॥నన్ని॥

మిమ్ముల విడిచి - నిమ్మహి యుండనే! సెలవిచ్చి గొంపోగదే - ప్రాణేశ
వీడుట - బాడియటే - ఘనమానిందు - చంద్రానుతా॥ నన్నింక॥

రాము— 16 మలయమారుతము—ఏకతాళము.

అచలాత్మజా - యేటి కోరికే॥ అచ॥
ఘోరకాననముల్ - జేరియుండవలె - నరులందు లేరు -
నానాజంతుసమితి॥ అచ॥
కందమూలముల - గాసిబొక్కవలె
కుందరదన - కూడు నీళ్ళు లేవు ॥అ॥
నడువ జాలకీవు - బడలిపోయెదవు
యుడురాజముఖి - యుండుమింటికడ ॥అచ॥

భరతుడు— 17 ఇంగ్లీషునోటు—ఏకతాళము.

నాథుని జంపిన - నాపాలి రక్కసి
భేదము జూపియు - బెద్దల బాపితే ॥నా॥
నీనాలుక చీల్చను - నాకేల రాజ్యము.
కానకు బంపితే - జానకిరాముల
సిగ్గేల లేదో కా - శిరము త్రెంచికిట
పగ్గియ చూపితే - పాపిని కైక ఛీ॥ నా॥

శత్రుఘ్నుడు— ఇంగ్లీషునోటు—ఏకతాళము.

శాంతము బూనుము - స్వాంతమునందున
చింతను విడి మాత - శిక్షింప జెల్లునె
మాతహంతకులంచు - ఖ్యాతి రాముడు బల్కు
ఖ్యాతికి - మోసము - నాతిని - జంపగ ॥శాం॥

రాముడు— 19 ముఖారి రాగము—ఏకతాళము.

ఈశా - సర్వేశా - ఇపుడెది - దిక్కు మాకు - ఈ॥
అతివను గూడినే - నడవికి వచ్చితి - గతియెటులుండెనో - గననా
వశమా॥
బాలా - సీతా - ఈలా - వసలో - బేలా - యయ్యో - జాలి
లేదా॥ ఈ॥
పాపుడ నేనిల - పగతుని రీతిగ - తాపము బెట్టితి ధరణిజ కిట్టుల॥ ఈ

లక్ష్మణుడు— 29 ఇంగ్లీషునోటు—ఏకతాళము.

మింటను ధూళిట - మిక్కిలి లేచెను
వెంటనే వచ్చెగ - వేగమె భరతుడు॥ మిం॥
కావరమెచ్చియు - కన్ను మిన్నగనుండె

సీతే

# అనుబంధము

భూవర సెలవిమ్మా - బూది యొనర్చెద-
సాయము లేకనే - సాధించి వేధించి
దాయాది తనకను - దండింతు ఖండింతు
దుష్టుడు- భ్రష్టుడు - కష్టుడు- కైకజుడు ॥మిం॥

భరతుడు— 21 కమాసు రాగము—ఆదితాళము.

నన్నుబ్రోవవే - రామ - దయచేత ॥ నన్ను॥
అన్నరో - నాదుతప్పు - లెన్నకు - నన్నుతింతు-నన్ను
తల్లియిటు బల్కవనికి - వెళ్ళనీకు ధర్మమౌనె-
పిల్లగాను యిందరిని - గొల్లుమన సేయనౌనె ॥నన్ను॥
అన్నరో - రాజ్యరమను - చెన్నుగ - స్వీకరించి - యెన్నాక
తిప్పలింక - పన్నాగ భరతునింక - అన్నా - దయజూచి ॥నన్ను॥

భరతుడు— 22 మోహన—ఏకతాళము

తెమ్మా - మీపాదుక - లర్చనను సేయక - భక్తియు దప్పక
రక్తియునిలువగ - ఘనమౌని - చంద్రధరవందితా ॥ తెమ్మా॥
బిడ్డలగతిగను - బ్రీతిగ బ్రజలను -
దొడ్డగ నేలెద - దొరతనమునను ॥ తెమ్మా॥
దోసము లేక నే - వాసిగ పదముల -
రసికత గొల్చెద - రామ శ్రీరామా ॥తెమ్మా॥

సీత— 23 కాఫిరాగము—ఏకతాళం

నాకింక దెచ్చివ్వరా - బంగరు లేడి ॥నా॥
ఆ కులుకుచూపుచే - ఆతళుకు మేనిచే -
ఆనందమును మీరె - జనుము -కనుము - జాగువిడియు ॥నా॥
మేలిమి కళుకుల - మించుండె గనుమది -
పారిన విడకుండ - బట్టి - కట్టి - నిట్టువేగ ॥నా॥

రామ— 24 జంఝూటిరాగము—ఏకతాళము.

వహ్వారె యాహరిణి విచిత్రం - వహ్వారె యాహరిణి
తమ్ముడా - ఆనందమాయెనుగా - విచిత్రం ॥ వ॥
మున్ను బలికితి - నన్నరో దేవికి - యిష్టంబుగా - దీరుతుననుచు ॥వ॥
లేడినివేగమె - లేమకు నివ్వడు - పట్టివ్వగా - జనుమా లక్ష్మణా ॥వ॥

లక్ష్మణుడు— 25 హం॥ తోడి—ఏకతాళము.

చింతిలకమ్మా - శ్రీరాముని కై నీవు ॥చిం॥
జనకవిభుని ప్రియతనూజా - నాదుమనవి వినుమిదె భూమిజా ॥
అనఘుండగు నీదు రమణుడు - లెడిని నిటుదెచ్చుచుండె ॥ చిం॥

సుదతీ - రామునిరాణీ - సూనృతమాడెడు వాణీ .
మదిదిగులునుబొందనేల - మానుమమ్మ యీవగపేలా
అవక్రవిక్రమ పరాక్రముండగు - రఘూత్తముని కేయాపదవచ్చు
నమ్మా॥
నీమదిగలదుఃఖమును వీడి క్షేమమే గదమ్మా॥
వినియెద - జనియెద - వనినే - జూచెద ॥ చిం॥

26 దైలాగు ఫీలు—ఏకతాళము

సీత— అనుజు - డనుచు - జేరి - వచ్చితిరా - యిదిమేరా - మదివేరా-
వినవేరా - ఓబుద్ధిహీనా - రాముని గానా - కానయందు న- జూడ
జనవేరా - స్వాంతము లేదా - పోవేమివాదా - కపటసుతుడ
కానుము జడుడ ॥అ॥
అన్న నిట్టివీడుటల దగునా - అయ్యోయేమిది పలుక వృతగునా-యింతి
క్రూరమా - గనగ మోసమా నన్నుబట్టుటకు - నీదుయత్నమా -
ముట్టదరమా - దుష్టజనమా - గనియు రమ్మ - రామునింక ॥ అ॥

లక్ష్మ— రామరామ - జానకీకామ - నేడునన్నుబ్రోవుము - మనవివినుమా॥
అయ్యయ్యో - యీపరుషంబు లేల - అలింపజాల పాలింపురామ-
నేనింక యీలా- జీవించనేలా - ప్రాణమువీడా - నుంటినీ వేళా-రామ
అదుర్దావిడువుము - నీవింక సీత - ఆ రాము డిటవచ్చు నమ్మింక మాతా
చింతించదగదింక జనకజాతా క్షేమమె రాముని కుసిరను భూజాతా॥రా॥
భూమిదుహితా - రామువిహితా - వినుగరితా- యేలను వంతా॥
కనుగాగతి - సుజనహితి - రామఖ్యాతిరమణి సుమతి ॥రామ॥

లక్ష్మ— 27 ఫీలు - ఏకతాళము.

ఇటు మీరిరాకుసుమ్మా యీగిరి గని నిలుమమ్మా ॥ఇ॥
ఈయటవి దుష్టరక్కసుల కునికిపట్లమ్మా
వాండ్రు మాయ వేషధారులుగదమ్మా ॥
యిచటనుండు నాదుమాత - పోదునమ్మ జనకజాత ॥
తెలివి నుండు భూమిసుత కపటమాను - లోకమాత
తెలివితోనుండుము - పోయెదసీతా
తెలివితోనుండిటు - సెలవిడు మాతా ॥ఇ॥

సీత— 28 ఆనందభైరవిరాగము—ఏకతాళము.

నా ప్రాణనాథు - కాననమున - నరసిబ్రోవవే
నా ప్రార్థనంబు - లాలకించి - నన్ను గావవే
హే! నిరామయ - నిరంజన - నిష్కళంక

హానిరాకుండ - నావిభు నరయుమయ్యో
మునిచంద్రిచంద్రినింక - మీరు కనియు గావరే
జగము వెలిగించు హే - సూర్యచంద్రులారా
దిగులుమాన్పి నన్ - బ్రోవరయ్య - దిక్పాలులారా
యీరామ రామచంద్రి నింక - యిపుడె జూవరే॥

రాముడు—
29 బారువ—ఏకతాళము
క్షితిసుత నినుబాసి ధృతమతి యెట్లుందు
హితమతి సీతా - సతీమణి నేతా
పతితపావని సీతనెందు - పరగనెచట నేనుగందు
అతివపలుకు లెపుడువిందు - హాయి నా కెపుడుజెందు
హే! పరాత్పరా - కరుణాకరా - కావవేరా
సతతముగొల్తుము - సత్యముసమ్ముము
హితవుగ - సీదయ - నివ్వడుజూపుము
ఓ! శాత్రివభంజన - సజ్జనరంజన
సత్వరకృపగను - మింకన్॥ క్షితి॥

రాముడు—
30 ముఖారి—ఏకతాళము
పోయెనుగద హా! ప్రాణకాంత బాసి రాముని॥ పో॥
హా! సురలారా! హా! గిరులారా! హా! తరులారా - యరసిరె
సీతన్॥ పో॥
దండకాటవిలోనె - దరుణిని కోల్పోతి
అండజయాన ని - న్నరయుటసున్నా॥ పో॥
ఎక్కడసీతా - ఏది భూజాత
చిక్కదు నాకిక - క్షితిసుత సీత॥ పో॥

సుగ్రీవుడు—
31 ఇంగ్లీషునోటు—ఏకతాళము.
కనుమా - జనుమా - హనుమా - వినుమా
వారలెవ్వరో - వచ్చుట - యేలాకో॥ గను॥
వాలిపనుపుగా - వచ్చినవారని
జాలనమ్మికలేని - సందియ మేలా॥ గను॥
విల్లునమ్ములను - కొల్లగచేకొని
చల్లగవచ్చెడి - సరసులరీతిన్ ॥గను॥
మౌనివేషములు - పూనియువారలు
దానమోసమును దప్పక సలుపరె॥ గ॥

సుగ్రీవుడు— 32 హిం॥తోడి—ఏక.

కులకాంతను - బలిమినిగొని - చులకనగను - ననుగనివడి - వలదం
చును - కిష్కింధలో - వాలినన్ను బారదోలె॥ కుల॥
భయమందియు - నయమందున - బ్రతుకుచుంటి - నగములందు॥
కావుమింక - రామచంద్ర - కరుణసాంద్ర - సుజనచంద్ర॥ కుల॥

రాముడు— 33 ఇంగ్లీషునోటు—ఏక.

రామునిమానతి - రవిసుతమీరియు
భూమిపై బ్రతికిన - పురుషులుయుండిరే॥ రా॥
రాజ్యము చేకూర - రమణిని జేపట్టి
వ్యాజముచేసియు - వెళ్ళియొమరచితో
బుద్ధినిల్కడ లేదా - యుద్ధమునందున
సిద్ధము దుృంచెద - స్థిరమది వాలిగ
రమ్మింక సేనలతో - రయమున రాకున్న
వమ్ముగ రాముండు - వాడియు జూపియు -
దండించు - ఖండించు - వండించు - నిన్నింక॥ రా॥

వానరులందరు— 34 డైలాగ్.

గజ— శతయోజనములు నేనుగా - విదితంబుగ సంద్రముదాటగా
మదిధైర్యము చెడియుగా - విను - వదియేగెద ఫలమేమట -
భీషణమది నాకగా -

గవా— యిరువది యో - జనములనే - పరువునబో - యెదపైనగా -
గలదని నేనుగా - గట్టిగజెప్పగా - అవలబోవగా - అసమర్థుడ..

సుషే— దెబ్బకు బోయెద - డెబ్బది యామడ
అబ్బబ్బావల - అది నా వశమా
జనకజవార్తల్ - మనకెటుదెలియుగా
ఘన సంద్రంబుగా - గడువం జాలగా -

అంగ— పలుకులికేలా - బలుకగ జాలా - జలనిధిదాటగా - జులకనన
బలిమిగా - మరలగా - బహుకష్టంబా॥
వినెదగా - జనెదగా - కనెదగా - సెలవిడవే - నిలువకవే -
నేగా - జులకనగగా - గలచెతనేగా - కలగకుమీ
యలగకుమీ - అ హా హా హా॥

ఆంజనేయులు— 35 హిం—ఏకతాళము.

ఏగువాడనిక - జాగుసేతునను - సూర్యచంద్రులిల
నుడివడగా - జడియాకనేగా॥ యే॥

గిరులు తరులు భువి - జలధులెల్లమరి - పుడమి నభంబులు ఘోరనగా
దిక్కుల్ - పెక్కుగ - పిక్కటిలగ - ॥యే॥
ధాటిగ వార్నిధి దాటియు వేగగ - ధరణిజ నచ్చటదర్శింపగ
జట్టుగవచ్చిన రక్కసిగుట్టల - బట్టెద - గొట్టెద - మట్టును-
బెట్టెద-
కనియుపుడమిపై - వినియు నెరుంగని - వింతలజేసెద వేడుకగాన్-
చనగన్- సెలవిడు-హనుమని గనివిని - హాయ్ హాయ్ యనగా.॥యే॥

ఆంజనేయులు— 36 ధన్యాసి—రూపకతాళము

ఎందుకుడాగి యున్నావో - నీవెందు డాగి యున్నావో॥
భూమిజాత లోకమాత ॥యె॥
రాముసతివి - సుగుణమతివి - సుజనహితవి - పరమసతివి ॥యెం॥
తిరిగి తిరిగి వేసరితివి -పురములన్ని సందులన్ని - దురితహరుని
కరుణకరుని యిడుములు బడుమని యూడవిని ॥యెం॥
వాడవాడ లన్నిగనితి మేడలన్ని తిరిగిజూచి వేడివేలుపు
వంశపావని మనవిని తనయుకు గనుపడు॥ యెం॥

ఆంజనేయులు— 37 హిందూస్తాని ముఖారి—ఏకతాళము.

కనుపడదా...య హా! సీతా! లోకమాతా! ॥క॥
యినకులచంద్రుడౌ...శ్రీ...రామచంద్రునీ సతి॥క॥
యేమనిచెప్పుదు రామునితోనిక నెట్టులుపోవుదు- వారల
గాంచగ హా! దైవమా ॥క॥

38 దైలాగు.

రావణాసురుడు—బాలరోయిలా బలుకగనేలా భావ్యమానె నీకు
పంతమదేలా బలిమిగ జలిమిన్ లలనన్
విడువకనే జడియకనే పుడమిజనే గలిసెదగా
వినెదవుగా విపులముగా ఆహోహా॥ బాలా॥
మండోదరి—ఏమిదినాథ వినవిదివాదా యేమికీడు వడి చేరునోగదా బలిమిన్
జెలియన్ గలియన్ శుభమగునే వలదసినే యడిగితినే పోద
గదే వలపునిదే నిలుపగదే చాల్ చాల్ చాల్ ॥యే॥

39 దైలాగు.

మరీడోదరి—విను విను వినునీ విషయము మనువును
చనకు చనకునీ భూజాతదెసన్
విను విను విను నీ విషయము దలపకు
చారుచరితాని పరసులమితాని ॥విను॥

రావ— చాలును లెమ్మా సఖివిడకొమ్మా
సరి సరి పొమ్మా సఖివినుమమ్మా
మేలయిల్లుగను కేలరీతిగను
జాలినొందెదవు సరగునబొమ్మా ॥చాలును॥

మండో— చారుచరిత్రా సరసిజనేత్రా
సురవరజైత్రా నిరుపమగాత్రా
మేలచూచెదవు కూళ సీత నిల
కేరనీకు యిటు రమణులు నాథ ॥విను॥

40 పీలు.

సీత— హా! ప్రాణనాథా!
పాపపువిధి ఇట్టి పాటులజేసెనే
కో, పా, మా, నా, యెడ ప్రాపుకుఁజేర్చవా? ॥హా॥
రావణు మోసము రామనిన్నుఁబాపె
ఘో, రా, దుఃఖముల్ కుడుచుచునుంటి ॥హా॥

41 జిలాగు

ఆంజ— మానినీమణీ సెందుగాంతు కాననసీమా
మానవతిరో గానరావా కాననసీమా
సీత— రామచంద్రు గాంచగలనా రహిని నేనిక
శ్యామగాత్రు ప్రాణకాంతు శ్రద్ధవీడితో
ఆంజ— లంకలో రమణీసీ వేవంకనుండితో
పంకజాక్షి కానరావా కాననసీమా
సీత— లంకలోను నెట్లుమనుట జంకకుండనే
నింకమనుట కల్ల పుడమి పంకజాస్య! హా!
ఆంజ— రక్కసులు మ్రింగిరేమొ రమణినక్కటా
సీత— చక్కనినా ప్రాణనాథా సఖనిగాంచవా

వ— 42 హిం. తోడి——ఏకతాళము

కల్కిమిటారీ కంతునికటారీ ॥క॥
పల్కవేమినాతో చిల్కలకొల్కి ॥క॥
చేడెరో భాగ్యంబు చేకూర్తునిప్పుడే
వేడెదనన్నూడవే వేగమెననుగావవే ॥క॥
శౌర్యధైర్యనిధిని చేపట్టిసన్నవేల ॥క॥
నీకోరికలకా దీర్తునే కోమలివన్నూడవే ॥క॥

హా! సీత నన్జూఁడు - నారాజ్య మిచ్చెదనే
నా ప్రాణమని యెంతునే - నాయొందుప్రేమించి దాసిలోగదే ॥క॥

సీత— 43 హిం॥తోడి—ఏక.

ఫో, ఫో, ఫో, ఫి, క్రూరుడా, - ఫో, నీచభామ॥ ఫో॥
దశరథరాముడు - ధరణీజకాముకు
విన్నాజమ్మించురనేడు - నాప్రాణేశుకోపాగ్ని జూడు - క్రూరపల్కు-
విడుము - కూడదు వేజుము॥ ఫో॥
వినువినుచోరా - ఓరీక్రూరా - మనరాపోరా - గనునీగతిరా॥ఫో॥

రావ-- యెంతదానవెరామ - ఓనాదుభామ॥ యెం॥
నిన్ను నేవిడనేన్న - లేవేభూమిజచన్న॥ యెంత॥
సరసమూహా లా-సఖగుణశీలా- సణగడుగోలా- నన్వీడమేలా ॥యెంత॥

ఏకజట— 44 హిం॥తోడి—ఆదితాళము.

చింతామానుమిక - పాపినీ - సీత -సంతానొందకుము-మానినీ ॥చిం॥
చూడుచూడు నాతీ - వేడు ఓ దుష్టామతీ
చంపానెంచితిమిగోతి - నిను - చంపానెంచితిమి గోతి
క్రూరమతి - యేమిగతి - రాముసతి - ఓసి సీత॥ చింత॥

ఏకజట— 45 హిం॥తోడి—ఏకతాళం.

కోరిచేరు మాదురాజుని మది - కొరతలేదు
నికుగొంకకు॥ కో॥
వినువినులేవే - మననికరావే - శయ్యా జేరనిక - జనవే-విరి-శయ్యా
జేరనిక కనవే॥ కో॥
జాలమేల - మీరెవేళ - ఓసిబాల - రావణలోలా ॥కో॥

అంజ— 46 హిం॥ తోడి—ఏకతాళము

రా, రా, రా, రా, రమణీమణిరొనిను-రాముని సన్నిధి జేర్చెదనే॥రా॥
నారీమణిరో - వారిజాక్షిరో -
సరసిజానన - మరళగమన - సమయమిదియె - జనకజా॥ రా॥

47 డైలాగు

అంజ— రా, రా, రా, రా, రణమున నిసూదునిమెద-రక[illegible] ముగా
దురంబునను నిగా - విరోధమునసే- హరించెదగా గన్[illegible] ను నేగా-

అక్ష— రా, రా, పోరగా.

అంజ— జాలా మేలా.

అక్ష— ఆలమునేయుగ - జాలముదేలను - జాలమువీడి [illegible]సరగున రా.

అంజ— బాలకచాలవు - ఆలమునందున - కాలునుజూ[illegible] [illegible]

అక్ష— తులువా, పలువా, పొగరడతుఽ
అంజ— పలుకల్ - బలుకఽ - జులుకనలే
అక్ష— రా, రా, తున్ంతుఽ
అంజ— లేరా చూతుఽ
అక్ష— కదనంబు సేయగ చాలవుపో
అంజ— వదరకు నీవింక పొగరడతుఽ
ఇంద్రజిత్తు— 48 బేహాగ్—ఏకతాళము.
సేవకా - విల్లునమ్మలను - నిల్లిమ్మా
బ్రహ్మబాణమును - గొనిరమ్మా॥ సే॥
శిరమును ద్రుంచెద - శిరమునుబూని - సరగున తెమ్మిక - సభికులు
జూడఽ - ద్రుంచెద వీనిని తే తెమ్మా॥ సే॥
వీని ద్రుంచెద నేనిక తే తెమ్మా॥ సే॥
ఒడలనుజీల్చియు - పుడమిని వైచెద-జడియక నిల్వుము-జగడమునఽ
రూపును మాపెద-రారమ్మా-నీవు లేవిక గూల్చెద-రారమ్మా॥ సే॥
రాముడు— 49 ముఖారి
సోదరా! గతించితే యెవరునాకు దిక్కిలా.
ఎవరు నాకు దిక్కిలా? ఇంకెవరునాకు దిక్కిలా॥ సో॥
నీకు పూర్ణాయువు - నీరజాక్షు డొసగడనుచు
ప్రకటముగ నెవ్వరైన - బల్కరైరిగా॥ సో॥
నీదుమాత భార్యలకు - నేమనంచు దెల్పువాడ
మోదమెసగ నిన్నుబోలు - సాధులున్నె యీధరఽ॥
రాముడు— 50 ఇంగ్లీషునోటు—ఏకతాళము
ఏరా - క్రూరా - మేరా - తీరా
తెగవేయుటసిఽ - తెలియవుగా॥ ఏరా॥
ఖర కర నిన్నుఽ - ఖండించెద నే॥ ఏ॥
జ్ఞాతి వైరమును - జూపుచునీవుఽ
నీతి దప్పి యుద - యుంచితివౌరా॥ ఏ॥
నీదుమేను వే - తునియలుగాగఽ
జేయు కనుమిదె - శ్రీరాముఽ॥ ఏ॥
[రా]ముడు— 51 ఇంగ్లీషునోటు—ఏకతాళము
నిలుమిందుపోక - గను నాదు రాక
సురల్ వంగిరాగ - నరుల్ బారిపోగ
రణశూరు డంచుఽ మది నెంచకఽ - వచ్చితో

మేదిని - గు ... ఌగ - జేతునేను
ఈశుడా - యూ - కేశుడా యు కెవ్వడొచ్చినన్
గాంచి - హరించి - మించి - సంహరింతు - పో రావణుండు.
వినక - జనక - నిలిచి - యున్న - జంపి వైతుగా॥నిలు॥

రావణుడు— 52 ఇంగ్లీషునోటు—ఏకతాళము

బాహుబలమునుగాంచు - మీ రణంబునందు నిన్
గాంచెదన్ - దుంచెదన్ - యింక నీవు - లేవురాముడా
ఓ-రీ-పో.

రాముడు— రణమున నిన్ను నరిగాంచెదన్ - గాంచెదన్ - గాంచెదన్
కోపముదీరన్ - కోరికలారన్ - కష్టము - గజపతి - కడ తేరన్
దురమునందు దుంచెదన్ - బ్రతుక లేవు రావణా॥
ఓ-రీ-పో.

రావ— చులకన పలుకులు - పలుకక రారా

రాము— కలనను నిలువుము - కడ తేర్తున్

రావ— జాలమేల రారా

రాము— వేళవచ్చె లేరా

రావ— వినరా

రాముడు— మనరా

గా...డు— 53 సావేరిరాగము—ఏకతాళము

ఆనందమాయెగా - అనుజా - లోకమంత ॥ఆ॥
దుష్టరక్కసి రావణువధచే - కష్టమెల్లను గిట్టునుబట్టి ॥ఆ॥
అనుజనిమనమున్ - గనుగొని లంకకు - ఘనముగురా
జుగ గలుగ విభీషణు - డా, నం, ద, మాయె॥

...త— 54 పూరికల్యాణి—ఏకతాళము

కావవే - బ్రోవవే - కనికరమున నాథ నన్ ॥కావ॥
లంకలోన సంకటములు - రాయ నేను బడితికాల ॥కా॥
నీదుపాద నీరజముల - నిక్కముగను గొల్చుచుంటి ॥కా॥
రామా - జానకిరామా - రక్కసిజితభీమా - సుగుణశ్యామా ॥కా॥

55 ఇంగ్లీషునోటు—ఏకతాళము

అంటరాకు - వలదునాకు - తుంట - ఛీ, ఛీ - పో ॥అం॥
రక్కసము గొనిన నిన్ను రాముడెట్లు గొనును మరల ॥అం॥

౨౧ ముఖారి—ఏక తాళము

అను— ॥స॥

ఆంజ— . - వా - రా - వే

అను. దోషవి - హీనవే - దోసిలొగ్గితి

ఆంజ ఈసరివీరులు - వాసిగజూడనె ॥కా॥

అను పావకనీవునా - పార్థసలాలించి

ఆం బ్రోవవే నీవిక - భూమిజనే దయచే ॥కా॥

౩౦



# పండితాభిప్రాయములు

---

గుంటూరునుండి, రివిన్యూ ఇన్‌స్పెక్టరు బ్రహ్మశ్రీ భూసనగిరి విజయరామశాస్త్రిగా రిట్లు వ్రాయుచున్నారు:

మ॥ సనయోక్తిన్ రఘురామువృత్త మిది చక్కన్ ♦ సంపూర్ణరామాయణం
బనగా సర్వరస ప్రపూర్ణముగ వ్రా ♦ సె శ్రీనివాసార్చకా మహా
ద్గుణాఢ్యుడై సత్కవివర్యుడై యశంబుగను నీ ♦ గూడూరు కోటీశ్వరుం
డనఘా శంకర తత్కృతిన్ మనుపు ♦ మయ్యా పాఠకప్రీతిమై.

---

సిద్ధపల్లినుండి బ్ర॥ దంటు లక్ష్మీకాంతకవిగా రిట్లు వ్రాయుచున్నారు.

మ॥ సరస శ్రీరఘురాము సచ్చరితము ♦ న్సంపూర్ణరామాయణా
ఖ్య రహిన్ నాటకమొప్ప వ్రాసె సుమనో ♦ హారమ్ము బాల్యమ్మునన్
గురుభక్తుం డురుకోవిదుం డనగ నీ ♦ గూడూరు కోటీశ్వరుం
డరతిన్ శంకర! దీనిపాఠకుల శ్రీ ♦ రాయుష్యముల్ బెంచవే!

శ్రీ

# పీఠిక

## ప్రథమముద్రణము

ఉ|| మానక కర్మభూమిపయి ♦ మానవదేహముతో హితాహిత
జ్ఞానమెఱుంగు బ్రాహ్మణుఁడు ♦ చారుకవిత్వము నేర్చి జానకీ
జానికథల్ రచింపకయె ♦ సత్కథ లెన్ని రచించెనేనియున్
వాని వివేకమేమిటికి ♦ వానికవిత్వమహత్వ మేటికిన్||

బుధసత్తములారా!

తొలుత నేను పద్మినీలోకబాంధవము నొకచిన్ని నాటకమును 1916 సం||న రచించితిని. దానిని ముద్రింప ప్రయత్నింపనైతిని. ఇట్లు కొంతకాలము గడచెను. పదపడి మరొక నాటకము వ్రాయ నుత్సాహము బొడమ యెద్ది వ్రాసిన పూజనీయమై, సజ్జనాదరణీయమై, సర్వపాపక్షయమై, విలసిల్లునా యని మనమున దలపోసి తలపోసి, ఎట్టకేలకు శ్రీరామచారిత్రకన్న మించినచారిత్ర లేదని యెంచి రామాయణమంతయు నొకరేయి ప్రదర్శింప ననుకూలించునట్లు, "సంపూర్ణరామాయణము" అను పేర వ్రాసినాడ.

మ|| ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ...
..................ప్రాజ్ఞులార నిరసింపంబోకుఁడీ రాఘవే
శ్వరుచారిత్రము నెందరెన్నిగతుల వర్ణించినం గ్రాలదే.

అను ప్రామాణికముగా నెందరెన్నివిధముల రచించినను తనివిదీరని దగుటచే శ్రీరామచరిత్రకు మించు దివ్యచారిత్రము లేదనియు మనమున నిశ్చయించి 1919 సం||న వ్రాసియుంటిని. అప్పటి నుండియు కాకితములధర అధికమగుట ముద్రింప ప్రయత్నించినను నాయత్నము సాగమిచే నిరుత్సాహుఁడనైతి. ఇయ్యది నవీనరచన యగుటచే యీ గ్రంథమునం దనేకలోపము లుండియే యుండవచ్చును. "చెఱకునకు వంకబోయిన చెడునె తీపి" యన్నట్లు నా భక్తిభావమున వ్రాసిన యీచారిత్రమున దోషములున్నను శ్రీరామనామమే భరించుగాక యని నమ్మియుంటి. అయిన పండితాగ్రేసరులు దయతో నా తప్పులను దెలిపిన పునర్ముద్రణమున సవరించుకొనుట కెంతయు భవద్దాసుని ప్రార్థన.

గ్రంథవిస్తరభీతిచే మధ్యమధ్య కొన్నికొన్ని భాగములు విడిచి ముఖ్యపాత్రయగు శ్రీరాముని చరిత్రమునే విపులముగ వ్రాసియుంటి. అందులకై పాఠకులు మన్నింప వేడుచున్నాడ.

మఱియు నిందలి పాటలు చాలభాగము ఏకతాళము నందునే రచియించి యుంటిని. పాఠకులు వారి వారి చిత్తానుసారముగ రాగతాళముల మార్చుకొని పాడుకొనవచ్చును.

భవద్దయచే చిరకాలమున కీగ్రంథము నాంధ్రలోకమునకు సమర్పించునట్టి భాగ్యమబ్బుటచే మితిలేని యానంద మందుచుంటిని.

తగినంత సత్వరముగ అస్మద్విరచిత పద్మినీలోకబాంధవము, పురూరవయను నూతన నాటకద్వయ ముద్రణమై భవత్సన్నిధానమునకు రాగలవని తెలుపుట కెంతయు సంతసించుచున్నాడను.

ఈ నాటకము నా యెఱిగినంతవరకు ప్రదర్శనార్హముగనే వ్రాసినాడను. ప్రదర్శకు లిందలి విడనాడకయు నవ్యవిధులల చేర్పకయు ప్రదర్శింతురుగాక యని ప్రార్థన.

ఇట్లు.

